# సాత్రాజితీయము

[ఐదంకముల నాటకము.]

శ్రీబుద్ధిమతీవిలాసము, ఉత్తరరాఘవీయము, సత్య
హరిశ్చంద్రీయము, మున్నగు నాటకముల
గ్రంథకర్తయగు

బలిజేపల్లి లక్ష్మీకాంతకవిగారిచే
రచియింపఁబడి

భాగవతుల సుబ్బయ్యగారిచేఁ
బ్రకటింపఁబడియె.


[illegible]్యనిలయ ముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడినది.

1920.


 PRICE 0-14-0

# ఈ నాటకమునందు వచ్చు పాత్రములు.



## పురుషులు.

| | |
|---|---|
| కృష్ణుఁడు | కథానాయకుఁడు |
| వసంతకుఁడు | కృష్ణుని వేడుక చెలికాఁడు |
| శతధన్వుఁడు | సత్యను గామించిన మఱియొకఁడు |
| శేవంతుఁడు | శతధన్వుని సేవకుఁడు |
| సత్రాజిత్తు | కథానాయికతండ్రి |
| శంబరాసురుఁడు | శతధన్వునిహితుఁడు కంసమిత్రుఁడు |
| జాంబవంతుఁడు | భల్లూకపతి |
| వసుదేవుఁడు | కృష్ణు తండ్రి |
| బలరాముఁడు | కృష్ణాగ్రజుఁడు |
| సాత్యకి | కృష్ణుని సోదరుఁడు |
| అక్రూరుఁడు | వసుదేవుని మంత్రి |

## స్త్రీలు.

| | |
|---|---|
| సాత్రాజితి | కథానాయిక |
| రుక్మిణి | కృష్ణుని పట్టపుదేవి |
| కళావతి, మంజువాణి | సాత్రాజితి చెలికత్తెలు |
| మదనిక | రుక్మిణి చెలికత్తె |
| దేవకి | కృష్ణుని తల్లి |
| మాయాసత్య | శంబరుని సత్యావేషము |

శ్రీరస్తు.

# సాత్రాజితీయము

## ప్రథమాంకము.

### నాంది

ఎడపయి యున్న దారమణి ♦ యెక్కడిదా మణి? నేరమేమియు
న్నేదకను నేరమేమి! రమ ♦ ణీ మణులన్నను గొల్లలేటికె
న్నెద? వఱఁగొల్లలైరి రమ ♦ ణీ మణులిచ్చెడువారు మాకటం
చెడపయి మామణిన్ మణివ♦హించెడు వెన్నుఁడు మిమ్ముఁ బ్రోవుతన్

[నాంద్యంతమున సూత్రధారుఁడు]

(హర్షమున సభనాలోకించి) ఆహా! భగవంతుండును బురాణపురుషుండును సంధ్యాకాల తాండవాడంబర కేళీవిలాసభాసురుండునగు మహానటునకుం బ్రథమపుత్త్రుండును బ్రమథగణంబులకెల్ల నధినాథుండును విఘ్నాధిపుఁడునగు గజవదనునకు జరుగు నీ మహోత్సవసమయమున సమకూడిన యీపరిషజ్జనుల యుల్లాసంబెంతయుఁ గొనియాడఁదగియున్నది. వీరినింక సముచితనాటకప్రయోగంబున సంతసింపఁజేయవలయునని కదా కడంగితి (తెరవంకఁజూచి) మారిషా! నీవు త్వరగా నిటురమ్ము.

మారి—ఇదె వచ్చితి.

సూత్ర—మారిషా! పాత్రములన్నియు సిద్ధమైనవా?

మారి—మీయాజ్ఞ కన్యథా యెట్లు జరుగును? రంగమంతయు యథాయోగ్యముగ నలంకరింపఁబడియున్నది. చూడుఁడిప్పుడు,

చ. గణనకు మీఱు దీపకలి ♦ కల్కలి కల్, ఘనచిత్రనేత్రపా
రణమొనరించు వన్నెలతె ♦ రత్తలిరాకులతోడి పెందరుల్
రణదళిపాళి ఝాంకృతిగ ♦ రవ్యశ్రుతిధ్వని, వాద్యపుంధణం
దణ ద్విజరావమై, యలరె ♦ నాటకరంగము నామనింబలెన్.

కావునఁ బ్రయోగప్రారంభమునకై మేమందఱ మత్యుత్సాహులమై యున్నారము.

సూత్ర—ఈయుత్సాహమునఁ బ్రయోగింపనెంచిన నాటకమేదియో మఱచెదరుసుమా.

మారి—అంత యొడలెఱుంగనివమా! ఇప్పుడు లక్ష్మీకాంతకవిరచితమైన సాత్రాజితీయముగదా ప్రయోగింప నుద్దేశించితిమి. కవి యీనాటకము వ్రాయుటకుఁ గారణభూతుఁడైన విద్యాభిమానియు నుదారగుణాగ్రాపణుఁ డెవ్వరైనది నే నెఱుంగుదు వినుము,

ఉ. పాములపాటివంగడపు ♦ వార్ధికిఁ బున్నమచందురుండు, వి
ద్యామహనీయగేయకవి ♦ తావనితాభినుతాభిమాని, ల
క్ష్మీమహిళాకృపాశ్రియుఁ డ ♦ శేషజనప్రథమానదాన వి
ద్యాపరశాఖి, వొల్చు సుగు ♦ ణాంబుధి సుబ్బనాయశస్వియై.

చ. పరహితకారి యాతఁడు శు ♦ భంకరుఁడీ కవికాప్తుఁడై నిరం
తర తదభీష్టదాయియయి ♦ నవ్యవిధానకథావిధాబుధా
దరముగ సత్య పెంపిలిక ♦ నిట్ల రచియింపఁగఁజేసి తాఁగృతీ
శ్వరత వహించి మించె సుయ ♦ శఃప్రసవంబులనించి దిక్కులన్.

సూత్ర—మారిషా ! నీయవధానమును నీకృతీశ్వరుని భాషాభిమానమును నుదారగుణమును మెచ్చఁదగియున్నవి.

మారి—ఆర్యా ! చూడుఁడు.

ఉ. ధార సుధారసస్రుతివి ♦ ధంబలరార నెత్తావడంతి సిం
గారపు లేఁతనవ్వవలెఁ ♦ గమ్మనిభావము లూర ముత్తెపుం
గూరుపుఁబోని తేనెలొలు ♦ కుంబలుకుంబడిఁగూర్చి కావ్యపు
న్నేరుపుఁజూపువానికవ ♦ నిన్నమకూర్పఁ డెవండభీష్టముల్.

మారి—అట్లనకుఁడు అందఱెట్టి రసగ్రహణపారీణులు పాత్రాపాత్రజ్ఞులుండురా? కేవల ధనలుబ్ధులయిన జ్ఞానశూన్యులు కవితాతత్త్వమెట్లానందింపఁగలరు ? యభీష్టమెట్లు తీర్పఁగలరు. చెవిటికడ శంఖూదిన నేమిప్రయోజనము ?

సూత్ర—అవును అందులకే,

గీ. పరునియాచింపఁబోయెడి ♦ పతనమందు
యాచకుఁడు దాతనైజంబు ♦ నరయవలయుఁ
బాత్రమెఱుఁగనిలుబ్ధుండు ♦ పరిభవించు
యాచకునిఁగాన యాచ్న ♦ దైన్యంబుదెచ్చు.

(తెరలోపల) సాధు ! భరతపుత్రా ! సాధు ! అనుభవజ్ఞమైననీయీవాక్యము సర్వథా యంగీకారయోగ్యమై యున్నది.

సూత్ర—మారిషా! అల్లదే సత్రాజిత్తును శ్యమంతకమణికై యాచించి యతనిచే నిరాకరింపఁబడిన కృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు, మనమిఁకఁబోవుదమురా.

(నిష్క్రమింతురు.)

ఇది ప్రస్తావన.

శ్రీరస్తు.

# సాత్రాజితీయము

ప్రథమాంకము.

[పిమ్మట వసంతక ద్వితీయుఁడై కృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు.]

కృష్ణ—సాధు భరతపుత్రా! సాధు! అనుభవలబ్ధమైన నీయీవాక్యము సర్వథా యంగీకారయోగ్యమై యున్నది. వయస్యా! వసంతకా! యాచన యెంత చెడ్డదోయీ, చూడు

చ. నడకలు మందమౌ, మొగము ♦ నన్ వికలత్వమొసంగు, మాటలున్
దడబడు, కంఠ మీరెలుఁగ ♦ నన్ జెడిపోవును, మానసంబునన్
దడ జనియించుఁ, బాదములు ♦ దత్తలదాఁక వడంకు, నంతలోఁ
బడి చెమరించు యాచకున ♦ వస్థలకంటెను జావమేలగున్.

కావున

కం. తనకుఁ బరమేశ్వరుఁడి
చ్చినదానన్ దనిసి పెట్టుకుఁ ♦ జేసాపక యొ
ట్టినరుండు గౌరవముగా
మను నాతనిమనికి భువన ♦ మాన్యము సుమిత్రా!

వసం—మిత్రమా! సత్రాజిత్తును మణి యడుగుటకుఁ దొలుత నీకీవేదాంతములుఁ దోఁచకుండెనను గార్యాలోచనమునందు బృహస్పతివంతవాఁడనైన నాతో నేల మందలింపవైతివి!

కృష్ణ — వసంతకా! నేను స్వప్రయోజనపరుఁడనై యాశ్యమంతకమును నపేక్షింపలేదు కదా. యాదవరాజు దేశములోని యనావృష్టిమారీజాడ్యవ్యథల నపనయింపఁ దన్నడిగితిని. సత్రాజిత్తునకీమాత్రపుఁ బరోపకారబుద్ధి యుండవలదా? చూడు

గీ. ధనికుఁడై యున్నఁ బదుగురకు ♦ మనుపవలయు
దాఁ దినసి యర్థికీని పి ♦ త్తంబదేల?
తనసుధారసధార సు ♦ ధాకరుండు
పూని ముక్కోటివేల్పులఁ ♦ బ్రోచుఁగాదె.

వసం — లోభిని యాచించిన ఫలమిల్లే. పొదుగునిండఁ బాలుండినను నెగఁజేప్రుమ దగ్గరఁ జేరనీక వెనుకకుంబోయినఁదన్నుచు ముందునువచ్చినఁ గొమ్ములతోఁ గుమ్మబడి గేదపాలెవ్వరు పితుకఁగలరు? కాని నీవుకూడ నింతప్రయత్నము చేయఁదగి నంతటి ప్రభావ మాశ్యమంతకమణియందేమున్నది?

కృష్ణ — వసంతకా! శ్యమంతకప్రభావమెన్నఁడు నీవు వినలేదా యేమి? ఆలాగైన వినుము

సీ. కృష్ణపక్షవిభావ ♦ రీవేళలందేని
వెలయించుఁ బండువె ♦ న్నెలలపిండు
మకరాంకకేళికా ♦ మర్మపాండిత్యంబుఁ
గలిగించుఁ గామినీ ♦ కాముకులకు
కోరునర్థములఁ జిం ♦ తారత్నమునుబోలి
గృహమేధికి నొసంగు ♦ నహరహంబు
విశ్వంబునకు ననా ♦ వృష్టి మారీవ్యథా
జాడ్యదాహాత్యంబు ♦ సంతరించుఁ

గీ. బవలురేలు బ్రివర్షించు ♦ భాసమాన
పద్మరాగచ్ఛటల్ నూరు ♦ బారువుల ప
సిండియు నిజప్రభాపూర ♦ హిండనాతి
దంతురదిగంతమైన శ్య ♦ మంతకంబు.

వసం — ఇంతప్రభావముఁగలిగిన దీనిని సత్రాజిత్తు యెక్కడనుండి సంపాదించినాఁడు చెప్పుమా.

కృష్ణ — సూర్యు నారాధించి సంపాదించినాఁడఁట.

వసం — మిత్రమా! నీవును నీలాటి మణుల వేనవేలు సంపాదింపఁగలవాఁడవే. దానికై నీమనస్సునింక నాయాసపెట్టికొనకుము.

కృష్ణ — ఆయాసమేమియు లేదు. విశేషించి సంతోషముగానే యున్నది.

వసం — ఎందుచేత ?

కృష్ణ — ఆమ్మణి నడుగుటకుం బోయి నేను జూడవలసినదానినిఁ జూచుటచేత.

వసం — ఏమీ సత్రాజిత్తునకు మణితోఁ గూడఁ గుమారీమణి గూడనున్నదా యేమి ?

కృష్ణ — వసంతకా! నీయూహ యుక్తముగానే యున్నది. నీకిది యెవ్వరైనఁ జెప్పిరా ?

వసం — ఎవ్వరేల ? నీముఖమే చెప్పుచున్నది.

కృష్ణ — ఏమని ?

వసం — నేఁడు దేవియైన రుక్మిణి తప్పక కోపభవనమును బ్రవేశించుననని.

కృష్ణ — దుర్మార్గుఁడా! నీవుపోయి నిష్కారణముగా దేవికి నాపై ననుమానము గలిగించెదుసుమీ!

వసం — పదారువేల గొల్లయిల్లాండ్రు నిరంతరము నిన్ను సేవించుచుండినను నస్ఖలిత బ్రహ్మచారివని లోకప్రఖ్యాతి వహించిననీపై దేవికడ నెన్ని కొండెములు సెప్పిన నేమి ప్రయోజనము? కాని యాసత్రాజిత్కుమారీమణి నీకెక్కడ నెట్లుగ పడినది?

కృష్ణ — వయస్యా! వినుము. నిన్నటి సాయంసమయమున మణినడుగుటకై సత్రాజిత్తునింటి కేగి మరలివచ్చుచుండఁగా నచటందు సైంధవశిలాజాల సంఘటితంబులై సారసుధారసధవళములగు కలధౌతభిత్తికలచే నొప్పారుచు నభ్రంకషవప్రభాగంబైన యాతని కేళీసౌధాగ్రంబునందలి చతుశ్శాలాప్రాంగణ ప్రదేశంబున బంధురసుగంధ ప్రసూనగంధసార సంబంధంబుచేఁ బుష్పంధయంబుల కోగిరమ్ము వెట్టుచున్న తనధమ్మిల్లబంధంబు గంధవాహంబును సార్థకంబుగఁ బ్రోదిసేయుచుఁ బాలవెల్లిపైనున్న యల్లకలుముల యిల్లాలిలీలఁ జల్లదామరగద్దియపైఁ గొలువుదీర్చిన యలపలుకుఁ జెలంటివలెను, వెండికొండ నెత్తంబుల విహరించు నలమంచుఁ గొండరాచూలి చెలువున స్వైరవిహార లాలసయగుచుచుండి బంగారపుటనంటిమోకలోని నడిమిలేతమువ్వయందలి పన్నియం బుక్కిలించి యుమియుచున్న తన మవ్వంపు టంగకంబులకాంతి తనరతనాల నగల జిగివెల్లువలతోడం గలిసి యాకసంబున కకాలంబుగ నింద్రచాపలాభంబు గలిగించుచుండిన యొక్క—

కాంతారత్నంబు వినయంబుతోడి విద్యరీతిఁ దనసెయ్యంపుఁ గత్తియతోఁ గలిసి యేమేమో మంతనములాడుచున్నదాని, వెండియు

సీ. అజుని సృష్టికినెల్ల ♦ నవతంసకంబుగాఁ
దార్కాణ మొనరింపఁ ♦ దగినదానిఁ
దిరిజగతీలావణ్య ♦ దీప్తిరాశియనంగ
నభిరామ విగ్రహ ♦ మైనదాని
అసమబాణునిపేరి ♦ మైందరిజాలికు చేత
మంత్రిపింఛమనంగ ♦ మలయుదానిఁ
గవివాక్కులకుఁజిత్రి ♦ కారుతుంగియ కేళి
వలఁతియైమించు చె ♦ ల్వంబుదాని
గీ. విమల శృంగారరస సము ♦ ద్రమునఁబుట్టు
నగ్రిమాణిక్యమని చెప్ప ♦ నైనదానిఁ
జూడఁజూడ నొక్కొక వింత ♦ సోయగమున
నలరునిదు వాలుగంటిఁ గ ♦ న్నారఁగంటి.

వసం—ఈమెయేనా సత్రాజిత్తుని కుమారి ?

కృష్ణు—మఱియింకెవ్వరు ?

వసం—తిరిగి యేదో నానెత్తిమీఁదికిఁ దేనేతెచ్చితివి. నేనేకర్మ మెఱుఁగకున్నను నీలాటి కార్యముల కన్నిఁటికి నీకు నేనె తోడ్పడుచున్నానని రుక్మిణి యిదివఱకే నాకొంప త్రవ్వుచున్నది. ఆమె యనుమానమునకుఁ దగినట్లా బానిసకూఁతురు మదనిక యొట్టితేలువలెఁ జాటుచాటున నాపై రుక్మిణితోఁ గొండెములు చెప్పుచుండును. ఇట్లుండఁగాఁ దిరిగి యికాంత యెక్కడనుండియో నాప్రాణము నకై దాఁపరించినది. అయినను నీవుగూడ మెచ్చికొనుట కామె యెట్లుండునో చెప్పుము.

కృష్ణు—మిత్రమా ! ఆమె యిట్లుండునని పోల్చి యెట్లు చెప్పవచ్చు ? చూడు,

గీ. తుల్యగుణ ధర్మవస్తుల ♦ తోడఁబోల్చి
వర్ణ్యమిట్లుండునని చెప్ప ♦ వచ్చుఁగాని

పడఁతితోఁ బోల్పఁ సృష్టిఁ బ్ర♦పంచమందు
సదృశమేదియు లేనిచో ♦ శక్యమగునె? ॥

వసం—అవును నేను బ్రపంచమంతయు వెదకుచున్నాను గాని నాభార్య కాయకంటి తోఁ బోల్పఁదగినవస్తువు నాకెచ్చటను నగపడినదికాదు. తెల్లగ నుండుటంజేసియు నీరోడుటం జేసియుఁ బొరలుతీసిన నీరుల్లిగడ్డ సమానమగునేమోయని తలంచినను నాభార్య కాయకంటియందున్న చపలస్వభావము దానియందు లేకుండుటచేత నుపమ సరిగాఁ గుదిరినదికాదు. అట్లే సృష్టియందొక్కొకచోట నెక్కడను బోలికలులేని యాశ్చర్యపువస్తువులు గనంబడుచుండును.

కృష్ణు—మిత్రమా! అక్కాంతామణిని సృష్టించిన యాసృష్టికర్తకే దాని సౌందర్యం బాశ్చర్యధుర్యమై యుండనోపునని నేనిట్లు దలంచెదను.

వసం—ఎట్లు?

కృష్ణు—మ॥ తననిర్మాణకళావిలాసమున కా♦శ్చర్యమె మ్మెచ్చుచున్ ధాత క
ల్కికి నెవ్వారిపెకమూడటఁ మిగులదా♦ కేదృష్టిదోషంబు దా
ని నెకన్నుల్ఫలంబులై చనియెనన♦న్నింబయ్యేవాధ్య బా నం
తని పోకుండఁ బడంతికి గమన♦మాంద్యంబుం దటస్థించెగా ॥

వసం—ఓహో! యిందనక కృశాంగియైన యాయంగనవా నీవు వర్ణించుచున్నది?

కృష్ణు—మూర్ఖుఁడా! నయనంబులయందలి చాంచల్యంబును, నడుమునందలి కార్శ్యంబును నడలయందలి మాంద్యంబును సుందరీమణులకుసహజాలంకారములుగదా!

వసం—అలాగైన లంకగుమ్మడికాయవలెనున్న యీలంబోదరమును నాకు సహజాలంకారమేయైనది. కాని నావలెఁ బరమానందసుందరుఁడైన యాబ్రహ్మ నిక్కాంత నింత సక్కఁగా నెట్లు సృష్టింపఁగలుగు? ఆమెను సృష్టించినది నీవంటి రసికశిఖామణి యెవ్వఁడో కానోపు.

కృష్ణు—అదియేమోకాని,

మ॥ భువనానందకరుం ఔ శానిధిని నే♦వుణ్యుండు సృష్టించెనో
ప్రవరామోదవిలాసమన్మథ కమల మే♦ భవ్యుండు నిర్మించెనో
చివురుంబోఁడిమి ఖంబుఁ గూడ నతఁడే♦సృష్టించెనే కాని, యీ
నవలావణ్యసుధాప్రపూరిత మయినం♦ రాలేద యాఁ రెంటికి ॥

వసం—మొత్తముమీఁద నీవుచెప్పినదంతయుఁ దావలచినదిరంభఁ దాముని గినది గంగ యను సామెతకు సరిపోవుచున్నది.

కృష్ణ—ఎందుచేత ?

వసం—ఆకాంతామణిమీఁది ప్రేముచే నమృతనిధియైనచంద్రుని బోత్తుగాఁదీసివేయుటచేత.

కృష్ణ—స్పష్టముగాఁ దారతమ్యము కనఁబడుచునే యున్నది; చూడు

గీ. కళలలో హెచ్చుతగ్గులు ♦ గానఁబడవు
మధ్యమున నల్లనగు పుట్టు ♦ మచ్చ లేదు
రాహుదంష్ట్రావిషాగ్నిచేఁ ♦ గ్రాఁగ లేదు
కోటినెమ్మోముననుకు విధుఁ ♦ డేటిసాటి.

వసం—ఓహో! నీవాచెలిం జూచినప్పటినుండి ప్రపంచమందలి సుందరవస్తువులనన్నిఁటి నిరసించుచున్నావు. ఇంక దేవియైన రుక్మిణి యామెదారి యామె చూచుకొన వలసినదే నా ?

కృష్ణ—మాధవుఁడా !

గీ. కన్నియం గోరి తెచ్చి కడానిఁ ♦ గాంచినంత
పట్టపుందేవి రుక్మిణిం ♦ బాయఁగలనె?
పద్మినీసంగి మాంబు దాఁ ♦ బడయుదనసి
యినుఁడు ఛాయాసతిని విడు ♦ చునె? వయస్య !

నేను దేవియెడ నట్టి యపరాధము నాచేయఁగలనా ?

వసం—అపరాధముకాక మరి యిదియేమిటి ?

కృష్ణ—ఓయి మాందసుఁడా ! లోకోత్తర సుందరవస్తువులు సర్వధా పరిగ్రహణ యోగ్యములుగావా ?

వసం—తమవస్తువులఁ దాము లోకోత్తరములని తలంచుట యొక్కవతప్పులోనిదికాదు.

కృష్ణ—మిత్రమా ! నీవు నామాట నమ్మకున్నావు. మదన సామ్రాజ్యలక్ష్మియనందగిన యాలీలావతీ తనూవిలాసంబు నేను నీకుఁదృష్టిగా వర్ణింపలేకపోయినందులకుఁ జింతించుచున్నాను. చూడు

సీ. కలువరాయునికి వం ♦ కలుఁదిద్దు నిద్దంపు
గళలనెమ్మోము చ ♦ క్కందనంబు

అరవిచ్చు మొగలిఱేకు ♦ క్రొవ్వాలీల నలరారు
వలిపెపుఁజీఱుతన ♦ వన్నెబెడంగు
కలికిబిత్తఱిఁ జింక ♦ చెలుల నుల్లసమాడు
తుల లేని బెళ్కుచూపు ♦ ఫులహారంగు
పలచనై కాఁవ ♦ న్నెలఁజిమ్ము నెలమావి
చిగురాకుమోవి సో ♦ యగఁపుమెలపు

గీ. పదియునారవన్నె బంగారు ♦ వన్నెకన్న
మిసమిసని మేనిపసిమియుఁ ♦ బసదలంప
నింతి కెంతెంత యందమో ♦ యెందువలయు
నంతయందంబు తూఁచిన ♦ ట్లవతరించె.

వసం— మిత్రమా! నాకుం దెలియదుగాని ఎంతసరసముగా వర్ణింపనలయునో యంతసరసముగా వర్ణించితివి.

కృష్ణ— మరియొకటి చెప్పెద వినుము.

వసం— వినుచున్నాను.

కృ— మ. సరసస్మేరములై, సవిభ్రమములై, ♦ సాకూతరాగంబులై
విరళస్నిగ్ధములై విలాసకములై, ♦ వ్రీడాభిరామంబులై
తరళాలోలములౌ కటాక్షముల న ♦ త్తన్వంగి కైసేయు నే
పురుషుం డా వాఁడే కృతార్థుఁ డాతఁడె జగ ♦ త్పూజ్యుండు ధన్యుండగున్.

వసం— అలాగైన నీవాపాటి ధన్యుండవైతివా?

కృ— వసంతకా! నేనిదమిద్ధమని యెట్లు చెప్పఁగలను? ఈవిషయమున మధ్యవర్తియైన మన్మథుఁడే పరిపాకముగాఁ గార్యమును నిర్వహించునో?

వసం— వయస్యా! చింతింపకుము: లోకమోహన సౌందర్యశాలివైన నీవు ననురూపవతియైన యాకన్నియఁగూర్పనిచో నామన్మథుని సమ్మోహన విద్యయంతయు నిష్ఫలముగా వృథయనియే నేఁదలఁచెద. ఇంతకు నక్కాంత నిన్నొక్కమాఱు చూడనైనఁ జూచినదా?

కృ— మిత్రమా ! చూడ కేమి ?

క. కలువలపై వెదఁజల్లిన
చెలువున, జాబిల్లి రేక ♦ చిక్కని తెలి వె
న్నెల రసముం జిలికినక్రియ
పొలఁతుక నను ముంచె నిద్ద ♦ పుంజూపులతోఁ.

కాండీశయ నాయంగన నన్నుఁ జూచినభంగిఁ దలంచుచు నాయంతరంగమూరక నాస
లకుఁ దావిచ్చుచున్నది.

వసం— నీచిత్తమెప్పుడు వ్యర్థమైన యాశలను వహింపకుకాని యామె నిన్నెట్లు చూచి
నదో చెప్పుము.

కృ— సావధానముగా వినుము.

మ. తొలుతన్ నన్గనుఁ జెప్పలార్పక కనన్ ♦ దోడ్తోడ లేసిగ్గునన్
దలకొంచెంబుగవంచి నేలఁబోట వేళ్ళ ♦ ల్లాటింపుచున్ బిక్కను
న్న లతాంగిన్ గనుమూటు జేసియరకం ♦ టన్ సానురాగంబుగాఁ
జెలిపై మలపెన్ విలోలతరల ♦ స్నిగ్ధంబులౌ చూపులన్.

వసం— అట్లుగాక నిన్ను జూచినతోడనే మేడమీఁదినుండిదిగివచ్చి నీతోడ పైఁగూర్పుం
డు ననుకొంటివాయేమి? నీపై నాపైదలికి వలపంకురించిన గనుకనే నిన్నంత
యొయ్యారముగాఁ జూచినది. నీవంటి కాముకులపాలిటి కట్టి క్రొంటి చూపులే
మరుని దూపులు.

కృ— ఆవాలుగంటి క్రొగంటిచూపులతో మరుని తూపులెట్లు పనికివచ్చును ? చూడు

మ. మును బూఁదూపులఁదీయువిల్లుఁగొని యా♦ను కన్నెంటికన్మంటచే
తను భస్మంబయిపోయెఁగాని వారుఁడీ♦కన్నె గి భ్రూవల్లికా
ధనువందున్ జెలివాలుసోయుగపు ♦ ద్రాఘూపులన్ దూపులే
యనుసంధించి యదల్చినన్ గెలువఁడే♦ యూనాఁడె గౌరీపతిన్.

వసం— ఆమన్మథుఁడట్లు భస్మమైపోయినను విరహుల వేధింప మానలేదుకదా. ఎట్లయిన
నేమి ?

కృ— ఎట్లుమానును ? ఆవిలాసవతి నన్నాలాగున నిజవిలోకన సుధారస ధారలచే
ముంచివేసినప్పుడు నాస్థితియేలాగున నుండెననుకొంటివి ?

వసం — మితముతప్పి భోజనము చేసిన వానిస్థితివలె నుండెనాయేమి ?

కృ — కాదు నెచ్చెలీ ! వినుము.

మ. అనిమేషస్థితిఁగాంచెఁగన్నుఁగవ; రా ♦ గానందభోగస్థితిఁ
గనెఁజిత్తంబు, చెమర్చి దేహము నిదా ♦ ఘక్లాంతమై పుల్కరిం
చె ననుంగా ! యికనేమనంచు హరియిం ♦ చెన్ జిత్తమా మాత్రకా
శిని, వెన్వెంటనె తుంటవింటిదొరగ్రు ♦ చ్చెన్ మేనఁబూబల్లెముల్.

వసం — ఓహో! నేఁడుచేయు దగ్ధపాకభోజనమువలెనే నీకథయెంతసేపటికిఁగడముట్ట కున్నది. ఇంత యారాటముగలదానవు నిన్నా కామిని యంత యొయ్యారముగాఁ జూచినప్పుడు వెంటనే యా వాలుగంటి మేడమీఁదికేగి యామెకు నీ హృదయంబేల తెలియపఱుపకపోయితివి ?

కృ — మూర్ఖుఁడా ! ఈపాటి స్వల్ప పరిచయము చేతనే స్త్రీల మనంబు లారయ వచ్చునా ?

మ. అరికంటన్ గనుగొంట, పయ్యెదను నొ ♦ య్యారంబుగాదిద్దుకొం
ట రుమారంబుగనవ్వుచుంట, కొనపం ♦ టన్ మోవిసారించుటల్
సరసీజాక్షులకున్ స్వభావమగు చే ♦ ష్టల్ ; కాముకుల్ సంతసిం
తురు లోలోనవియెల్ల స్వాత్మవిషయో ♦ ద్వ్యక్తంబులం చెన్నుచున్

వసం — సంతసించుటకు కాదు మీఁదుమిక్కిలి దెబ్బలుకూడఁ దినుచుందురు కాని యింతకు నాకాంత యభిప్రాయమేదియో తెలిసికొనకయే వచ్చితివా ?

కృ — ఎట్లు తెలిసికొందును? ఆవాలుగంటి నన్నాలాగునఁ జూచుచుండఁగా నెక్కడ నుండియో చుక్కతెగిపడ్డరీతి,

మ. అరజారుందెలిచీరకుచ్చెళులు పా ♦ దాబ్జంబులన్ జిందులా
డ, రటన్నూపురయై, వలగ్నమసియా ♦ డన్ బైఁటజీరాడ, స
త్వరయై, జొమ్ములుమోముకొంచు విగళ ♦ ద్ధమ్మిల్లబంధంబుతో
నరవిందానన యొర్తువచ్చెఁ దతమా ♦ ర్గాయాసఖిన్నాంగియై.

అట్లువచ్చి యేదియో యాసాత్రిజతికిం జెప్పి,

ఆ. వె. తత్తరంబుతోడ ♦ నత్తన్వి తనకేలు
బాలకేలుతోడఁ ♦ గీలుకొల్పి

పడనయే మొనాఁగ ♦ వడివడిఁగొనిపోయె
నకట నాదుప్రాణ ♦ సమితితోడ.

వసం—ఎక్కడెక్కడ? ఆ బానిసకూఁతురు తీసికొనఁబోవునపుడా సాత్రాజితిని మాత్రమేకాక నీ ప్రాణములనేల కొనిపోయినదో దాని కొప్పువట్టి నీయొకకు లాగి కొనివత్తును నన్నుబోనిమ్ము (పోఁబోవ)

కృ—మూఢుఁడా! అది జముగా నాప్రాణములను గాదు ప్రాణములవలెఁ బ్రేమాస్పదయైన యాకన్యారత్నమును మాత్రమే తీసికొనిపోయినది కాని నీవు శాంతింపుము.

వసం—శాంతించినాఁడను కాని ఈవిషయమై నీశరీరమును నిష్కారణముగా నాఁకూస పెట్టికొనకుము.

కృ—మిత్రమా! ఏమట్లు నిరుత్సాహము చేయుచున్నావు?

వసం—నిరుత్సాహము కాకేమన్నది కుసుములుగావు, ఉండ్రములుగావు

కృ—వయస్యా! నీకెప్పుడును భోజనభ్రాంతియే. ఇఁక విషయమును వినుము. అట్లు వచ్చిన మచ్చెకంటి తనకుం జెప్పిన యేదియో యొకవృత్తాంతమునంజేసి యాకన్నియ కించుక సంభ్రమపాటుచేఁ గలిగిన మనోవైకల్యమున నన్నుజూడ నవకాశ మెంతమాత్రము లేకున్నను, నెట్టకేలకు నవ్వాలుఁగంటి వెనువెంటఁజనుచుండి,

చం. మఱచితి నే పిఱుంద నెల ♦ మూఁపికఫుంజిగి యుంగరంబు నే
బిఱబిఱ నేగి తెత్తునని ♦ వెక్కకువచ్చి నిజాననంబుపైఁ
జిఱునగవింతనంతగను ♦ నేయుఁగ మధ్యనన్నుఁ జూచె బి
త్తఱి నునసిగ్గుతోఁ గలిసి ♦ తాఁగటలాడెదు నోరచూపులన్.

వసం—ఈమాట చెప్పవేమి. ఆ యొప్పులకుప్ప తన్ను తనంతతానే నీకొప్పగించికొన్నది. అదృష్టము లన్నియు నీకట్లు కలిసివచ్చుచున్నవి. కాని ఓయమ్మ బిడ్డలు గొట్టుకొనుచు నంతతొందరగా నక్కడకువచ్చి యక్కన్నియను దీసికొని పోవుటకా బానిసకూఁతురు కొంప యేమి మునిఁగిపోయినది?

కృ—నేనదే యచ్చట నుండు సేవకులనడుగఁగా వారిట్లు చెప్పిరి.

వసం—ఎట్లు?

కృ—నేనా సత్రాజిత్తును మణియడుగుటను మూఁడుదినముల క్రిందటనే దానికంఠమున ధరించి వేఁటకేగిన తనతమ్ముని ప్రసేనుని నెవ్వండో వధించి మణి హరించెనను వార్త యప్పుడు సత్రాజిత్తునకుఁ దెలిసినది. అని

వసం— ఇప్పుడు నీవన్నింటికిని జెడితివి. మణియుఁ గన్యామణియు లేకపోగా విశేషించి యమ్మణికై నీవే గదా ప్రసేనుని జంపితివను దుష్కీర్తి పేరి యింద్రనీలమణి నీపాలఁబడినది. ఇప్పుడు నీవును సత్రాజిత్తును తలపట్లు పట్టుకొనుఁడు.

(తెరలోపల) స్రగ్ధర॥

హితుండై సద్బాంధవుండై ♦ యఘమును మఱవఁ ♦ డెంత ద్రోహంబు జేసెన్
శతధన్వా! వేటకేగన్ ♦ చనుగు నమాత్యుకై ♦ శౌరి నా తండ్రి నార్చెన్
కృతవర్మా! యింక నీ ♦ ప్రక్రియ గని మరుపాటా ♦ కృష్ణుఁ గోనీ మురాదీ
బ్రతుకేలా? కాంచవే? యీ ♦ యగ నెటు యిక ♦ బాపుకో లేని యున్నన్॥

కృష్ణ- (ఆలకించి) వసంతికా! నీవనినట్లు సత్రాజిత్తు నాపైకి యుద్ధంబునకే సన్నద్ధుఁడై వచ్చుచున్నాఁడు.

వసం— నేను మీనమేషములు జక్కఁగా లెక్కపెట్టి చెప్పిన మాటయే యది కాని నన్నుమాత్రము నాభార్య కొప్పగించిరమ్ము. పరమదైన నాభార్య వైధవ్య దుఃఖము ననుభవింపలేదు.

కృష్ణ— భీరుఁడా! నేను నీదగ్గరనే యున్నానుకద.

వసం— అట్లయిన నీ వెనుకనుండియే నేను యుద్ధము చేసెదను.

[పిమ్మట శతధన్వయు రేవంతుఁడును సత్రాజిత్తు ప్రవేశింతురు]

శత— మామా! సత్రాజిన్మహీపాలా! యిక్కడ జూడుము,

చం॥ బలిసిన గిండుఁబిల్లివలె ♦ బాల్యమునుండియు గొల్లపల్లెలో
పలమెలమెల్ల వెన్నయును ♦ బాలును ద్రుచ్చిలి, యాటి తేజత్రో
వలఁదెలవాటు కాఁడగుచుఁ ♦ బాంధులసొత్తు గదోఁచుచుండు దొం
గలగురువైన కృష్ణుఁడదె ♦ ఘూ! యితఁడే, పగదీర్చుకొమ్మికన్॥

సత్రా— ఏఁడీ ఏఁడీ యాదురాత్ముఁడు?

రేవం— గర్భాతురమైన యీ వృద్ధమర్కటముతోఁ గూడ నిక్కడనే యున్నాఁడు.

సత్రా—

శా॥ ఓరా! మాధవ! యింతలోనె యిటులన్ ♦ న్యాయంబుగా వింతువా?
క్రూరాత్మా! నిను నేమిజేసితిను నా ♦ కీన్ బాపము ల్వచ్చునే?
తీరంబైన మదీయఖడ్గమున నీ ♦ తుండంబు ఖండించి నా
వైరంబెల్లను దీర్చికొందు నిలురా ♦ పాపాత్మ! ధీరుండవై॥

వసం—

చం॥ గడగడ కాళ్లు మెల్ల వడఁకఁగ, బెదవుల్ చలియింప, మోముపై
ముడుతలు వ్రేలుచుండ నడుమున్ బిగియించుచు, బోసినోటితో
వెడవెడమాటలాడు చదివీరముతోఁ, జరణద్వయంబు త్రొ
క్కుడువడు నిన్ను నీ ముసలికోపముఁ జూచిన నవ్వవచ్చెడిన్॥

సత్రా—ఏమీ! నాది ముసలికోపమా? ముసలికోపమో మొసలికోపమో నీవుచూచెదవు కాక.

కృష్ణ—ఆర్యా! యీబ్రాహ్మణునితో నేమి తొందరపడకుము.

వసం—కృష్ణా! రానిమ్ము కంపతో మగిడ్చినట్లేని నావలను నీవ్వికొనిపోవుటకు నేను నా కొంకికర్రతో నిక్కడ సిద్ధముగానే యున్నాను.

కృష్ణ—వసంతకా! నీవిక్కడు తొందరపడకుము. మామా! నేను నీకుఁ జేసిన ద్రోహమేమున్నది?

శత—(తనలో) ఏమీ! ఈదుర్మార్గుఁడు సత్రాజిత్తును "మామా" యని పిలుచుచున్నాఁడు. వీనికిని సత్యభామయందనురాగము కలదు. దానికిని వీనియందే మనస్సు పారయున్నదని దానిచెలికత్తె కళావతి నాతోఁ జెప్పినది. ఈ కృష్ణునకు సత్రాజిత్తునకు నేలాగైన విరోధము పెట్టితినా సత్రాజిత్తు వీనికి తన కూఁతునిచ్చి వివాహము చేయఁడు. అప్పుడు నేనే యీ సత్రాజిత్తునకల్లుఁడనయ్యెదను (ప్రకాశముగా) మామా! చూచితివా! యేమియు నెఱుంగనివానివలె నీ కృష్ణుఁ డెట్లు నటించుచున్నాఁడో! ఇంతమాత్రమున మనమాతని వదలివేయరాదు.

ఉ॥ పోటరివయ్యు నీవు వెఱపొందెదు, వీనికి దొంగకున్ బలెన్
మాటలయందమాయికత మానసమందభయంబు మోమునన్
గాటపుఁజిచ్చపాటును, వికారపుఁజూపులు తెచ్చికోలు నా
రాటము, హెచ్చుఁగావునఁ దిరంబుగ వీఁడె హరించె నీమణిన్॥

వసం—ఓరీ! నిర్భాగ్యుఁడా! నీవు నామీఁద చెప్పుచుండలేదుకదా.

రేవం—బావురుబిల్లివలె దొంగమాపులు చూచుచున్న నీవు కూడ నీ దొంగతనములలోఁ జేరియే యుండవచ్చును. నీవంటి చెడుగుబాపనయ్యలకు ధనాశయెక్కువ.

వసం—రేవంతుఁడా! నీ కొండముచ్చువేసాల చాలింపుము.

రేవం—చెడుగా! మొక్కజొన్న పేలగింజవలె నూరకపేలకుము.

శత—(కనుగీటుచు) నీవు తొందరపడకు నేను చక్కఁగా వీనిరువురకుం బుద్ధి పెట్టెదను. (ప్రకాశముగా సత్రాజిత్తుంజూచి) నీకింకను సందేహమెందులకు?

కం॥ తనయుఁడిగిన మణిని నీవీ
కునికి మహాటవిని నీస ♦ హోదరువధియిం
చెను నిజమింతయు! నెంతటి
పకింద్దెగెఁజూడు వీఁడు ♦ బాంధవ్యము లో॥

కృ—ఓరీ! శతధన్వీ! యేలరా నిష్కారణముగాఁ గృష్ణునంతవానితో విరోధము తెచ్చి పెట్టుకొనుచుంటివి. నీకాత్మవినాశకాలము సమీపించినదా యేమి?

శత—నిజమాడితినని నీవు నాపై నలుగుచున్నావు. నీకు వినాశకాలము సమీపించినది కావుననే నిష్కారణముగా సాధుశీలుని నిందింపమొదలుపెట్టితివి. (సత్రాజిత్తుతో) మామా! నీవేమైన నమ్మకొమ్ము ఈ కృష్ణుఁడు నీ కెంతెంత ద్రోహము చేయనున్నాఁడో నే నిప్పుడెఱింగించినచో నీవు విశ్వసింతువో లేదో? కాని,

శా॥ మోమోటంబడఁబోకు వీనిపనియుం ♦ పుణ్యాత్ములన్ నమ్మ, వీఁ
డేమున్మాటికి నీమణిన్ గొనియెఁ వాఁ ♦ డీపాటికిన్ దీరకే
మోమోసంబులువన్నుచుండెనట యిం ♦ కెందుంగూడఁ ఖండింపఁగా
మామా! యెందుకు లేఁడు ముష్టిమనుచున్ ♦ నమ్మింతువే మోసమిదా॥

సత్రా—అల్లుఁడా! నన్నుగూడ జంపనెంచుచున్నాఁడుగా నేను వీనికేఁ జేసిన ద్రోహమేమున్నది?

శత—నీవు బ్రదుకుటయే యతనికి నీవు ద్రోహముచేయుట.

సత్రా—అదెట్లు?

శత—ఎట్లులా? మరల నెప్పటికైనఁ దాగణించిన మణిని నీ వపహరింతువని నిన్నుగూడ మట్టుపెట్ట నాలోచించుచున్నాఁడు ఇప్పటికైనఁ దెలిసినదా?

సత్రా—ఓ దుర్మార్గుఁడా! ధూర్తగోపాలా? ఎంత దురాలోచనముఁ జేయుచుంటివిరా.

వసం—సత్రాజిత్తూ! పిచ్చివెఱ్ఱివై నిన్నురకకఁ అమముమన్న యీ యల్లుని నీవెక్కడనుండి సంపాదించితెచ్చితివి. వీని విషము నీకు తలకెక్కినదా యెవ్వరేమిచేయఁ జాలరుసుమీ!

శత—ఓయీ వసంతకా! పొట్టకూటికై నేర్చుకొన్న నీవంకరమాటలు చాలింపుము.

వసం—పొట్టకూటికిఁగాక సత్రాజిత్తుని బాగుచేయుటవియా నీ మాటలు. పాపమీ ముసలివాఁడు నాలుగుదినములు ప్రపంచములో జీవించియుండుట నీ కిష్టము లేదు

సత్రా—ఛీ బ్రహ్మబంధుఁడా! ఈ గొల్లవానికిఁ దోడుదొంగవై యుండుటను నీవుబా
గుగా నుపకరించితివి. సిగ్గుమాలిన నీజన్మమీభూమికి మిక్కిలి భారముసుమీ?
వసం— నేను నిన్నదేయనుచున్నాను. నీవూరక ననాలోచనముగా సివాలు వేయకుము.
మూఁడు యీ కృష్ణుఁడు నిర్దోషియైనట్లు నేనొక ప్రబలసాక్ష్యము చూపించు
చున్నాను.
సత్రా—ఏదీ చూపుము.
వసం—యిదిగో వినుము. శ్రీవృద్ధరాజా!

గీ॥ నిజము కల్లనెఱుంగక ♦ నిందమోపి
నాను చేపుని దూఱుట ♦ దోషమనుచు
నాగులాడెకి నీచెవి ♦ పోరుజరిగె
రేపు చెంపలు వాయింను ♦ కొండెకాన్న॥

సత్రా—ఓరీ! కృష్ణా! జారచోరశిఖామణివైన నిన్నీబ్రాహ్మణుఁడనుసరించిన దీలాటి
పిచ్చికూతలు కూయుటకా?
కృష్ణ—మామా! ఇందు నిజముగా నీవేపిచ్చివాఁడవైతివి. వినుము,

గీ॥ పసువకేవరేము సెప్పెన ♦ నిను నిందియె
నిజమనుచుఁ దూషించెదు ♦ నీచమతివి
కొండెకాఁడు దుర్ పలుపురు ♦ గూడి కీలు
బ్రహ్మనతెన టలాడిన ♦ నబ్రహ్మశంకన॥

మామా! దుష్కర్ముఁడగు నీ శతధన్వమాటలు పాటికివచ్చి నామాట గీటునం
బుచ్చి నీవింత యవిచారముగా మాటాడుచున్నావేమి?
సత్రా—గోపాలా! నేను విచారించియే మాటాడుచున్నాను.
శత—మామా! వీరు నామాటలు నిల్లనేయుచున్నారుకాని నీతమ్ముఁడేగిన యరణ్యమా
ర్గమున నీకృష్ణుఁడేసుమంతకాఁ జూచిన ఈరేవంతుఁడింకులకుఁ బ్రబలసాక్షియై
యున్నాఁడు (కన్నుగీటుచు) రేవంతుఁడా! నీవుకూడ నీ సత్రాజిత్తోప్రాజ్ఞునకి
నొకప్పుల్ల విడిచి వేయుము.
రేవం—సత్రాజిత్ప్రభూ! మీపాదములతోడు మీతమ్ము వెనువెంటనే ఈతఁడరణ్యము
నకుఁ బరువెత్తుచుండఁగా నాకన్నులతో నేనుఁ జూచితి. అప్పుడీతని చేత ధను
ర్బాణములున్నవి.
సత్రా—నందనందనా! యిందునకు నీవేమనియెదవు?

కృష్ణ—మామా! శాంతచిత్తుఁడవై విషయమును విమర్శింపక పిరికట్లాడించిన నట్లాడు
చున్నాఁడవు, చూడు.

సీ. శతధన్వ నేఁడునీ ♦ హితుఁడైనమాత్రాన
కడమవారందఱు ♦ గానివారె?
మణినిమ్మనడిగిన ♦ మాత్రి దానికినీవు
తమ్ము నేఁజంపుట ♦ తథ్యమయ్య
నేనియమునఁ జుడేగు ♦ కాన కేగినమాత్రి
యీరట్లు నాయందె ♦ చేరునయ్య
ఈదారిదక్క నిం ♦ కేదారిమణినాకు
లభియింపదంచుఁ ద ♦ లంతువయ్య
గీ. నిజము కల్లనెఱింగెడి ♦ నేర్పు వలదె?
చుట్టఱికమేని కానంత ♦ చూడవలదె?
చివరకుఁ బ్రమాణమును జేసి ♦ చెప్పుచున్న
నావచనమెంత నిసుమంత ♦ నమ్మవలదె.

శత—మామా! యితఁడెంత నైగారముగా మాట్లాడుచున్నాఁడో చూడు. నీతమ్మునిఁజంపు
నప్పుడెవరైన నున్నచో నంతపని చేయుదునా? చుట్టరికమైనఁ జూడవలయునట.

సత్రా—శతధన్వా! వీని కపటవచనములు నేనెఱుంగనివికావు. (కోపముతో కృష్ణునిఁ
జూచి) దురాత్మా! కప్పయెలుంగు పాముపైన నీవు నాకు బంధుఁడవు కావు.

శా. బంధుద్రోహివినీవు, కానిమెడదు ♦ ర్వ్యాపార సంధానధౌ
రంధర్యంబున నాస హోదరు వధిం ♦ పంజేసి కైకొందువా?
బంధంబుల్ విడనాడి, బంధురతపో ♦ భ్యాసుండవై పద్మినీ
బంధుల్ లోగాని నేగణించినమణిన్ ♦ బ్రఖ్యాతతేజోఘృణిన్.

పైఁగా నీప్రమాణవచనములు మేము నమ్మవలయునుగా? అప్రమాణముల
యందారితేరిన నిన్నెవ్వరు విశ్వసింతురు. ఉగ్గుఁబాలనుండియుఁ దొంగచెయ్య
ములతోఁ బెరిగిన నీవెంతుల గొప్పవాఁడవు చెప్పుము.

కృ—ఛీ మూర్ఖా! యేమి యూరక నిష్ఠురముగా వదురుచున్నావు.

ఉ. మాటికిమాటికిన్ దురభి ♦ మానముతో శతధన్వమాటలన్
బాటికిఁ దెచ్చినావయి నె ♦ పంబిడిచూచెదను, పెద్దవానితో

నేటికిదిట్టరిమ్మనుచు ♦ నేడను కాముకోలంది బల్సివా
లీల్మటు చుంబైకివచ్చెగా శి ♦ క్షింపవసుమ్మిక నిన్నుగూర్మితి!

వసం—కృష్ణా! ఊరకొన్నకొలఁది నీవడఁపీనుగింకను బైకివచ్చుచున్నాఁడు, నీవుకొంచెము దూరముగానుండుము. చచ్చినవానిం గొట్టుటకు యమదండమువంటి నా యీదండముతో నీతని చచ్చిన బురదకొయ్యం గొట్టినట్లు కొట్టెదను. ఏమి సత్రాజిత్తూ!

మ. మొఱగానింబలె గొంతుసించుకొనెదీ ♦ మూర్ఖంబు మాచేతగా
దనియా, హుమ్మని పైకివచ్చెదవు మా ♦ కాపాటి ధైర్యంబు లే
దనియా, కన్గవ కెంపుజేసి మెడగో ♦ య్యగ గత్రిప్పి కత్తినం
తనె చేతుత్తగియున్న వారమె దురా ♦ త్మా! యేటికీవింకముల్.

మ. సరసంజేరుము మావిరోధియెవఁడో ♦ చాడీలుబోధించిన న్
దురహంకారముచే నొడల్మఱచి గం ♦ తుల్ వేయు దేమాపనున్
అరయంగాఁ బనిలేదె కల్లయునిజం ♦ బాపాటి శాంతంబు లే
క, రసాభాసముగా మొఱంగి పయిగాఁ ♦ గాట్లాటకున్ వత్తువా?

కృ—వసంతకా! నీవూరకుండుము. ఓ వృద్ధరాజా! నేను నిన్ను సఖ్యమర్థించి నందులకుఁ గదా నాపై నీకింతయనుమానము. కావలయునన్న నిట్టిమణులు వేనవేలు నేను గణింపలేనా?

మ. చటులప్రౌఢి వియన్మణిన్ దులిచి నీ ♦ సాన్నిధ్యమందుంపనా
నటదీశోత్కట కాలకంఠవస ♦ న్నాగేంద్రభోగచ్ఛటా
తటకూటస్ఫుటరత్నసంచయములం ♦ దర్శించి తెప్పింపనా?
పటుగర్వోద్భటవిద్విషద్భటభిదా ♦ ప్రకాంతిచక్రంబునన్.

సత—ఈ డాంబికవచనంబుల కేమి లే.

కృ—సత్రాజిత్తూ! యీశతధన్వ నీకుఁ బ్రాణమిత్రునివలె నటించుచున్నాఁడు. మేక వన్నియపులియై వీఁడె నీమణి హరించెనేమో చూడుము,

గీ. మచ్చికయొనర్చి మెచ్చుగ ♦ మాటలాడి
దుర్జనులు మోసగింతురు ♦ తుదకు నోరుల
బోనులన్ మచ్చుమందిడి ♦ బోయవాండ్రు
మాయఁజేసి మెకంబులన్ ♦ బట్టురీతి.

వసం — ఓయీ! అమాయికుఁడా! ఈమాటగూడ నాలోచనీయమే పందికొక్కువలెఁగన్నములుత్రవ్వుటకే వీఁడు నీయింటఁజేరినాఁడు వీనినిఁకఁ దొందరగా బోనులోఁజేయ నుపాయమాలోచింపుము.

రేవ — ఓయి గుప్తబ్రాహ్మణుఁడా! ఈలాటి యిచ్చకాలలో నీవు చిరజీవివై కాకివలె బ్రదుకుచున్నావు.

శత — మామా! వినుచున్నావుకదా వీనియన్యాయపుఁబలుకులు

క. తనపైవచ్చిన యీనిం
దను నాపైఁద్రోసితాను ♦ తప్పుకొనంబ
ల్కినపలుకులివ్వి నమ్మకు
చెంటిని దలదడిపి బాస ♦ చేసినయేనిన్.

సత్రా — ఈవృత్తాంతమంతయు నాకు నత్యాశ్చర్యముగానున్నది. నేనెవరిమాటలని నమ్ముదును. కృష్ణా! శతధన్వా! మీకిరువురకు నేనొకమాటఁజెప్పెదవినుండు. నాకు సత్యయనునొక్క కన్యారత్నంబుకలదుకదా. ఇంతయేటికి?

శా. ప్రాగ్బంధంబునఁ దీనుబడ్డ ననుజ ♦ ప్రాణంబునే నవ్వఁడు తే
నేరండమ్మణి యుందమూ యెచటనే ♦ నిక్కె జిక్కఁగావచ్చు నేఁ
డో రేపో శతధన్వుఁడో మఱియు నీ ♦ వో లేక యింకెవ్వఁడో
చోరుండేటికినాకు దానినెవఁడీ ♦ చ్చున్ వాఁడె నాయల్లుఁడౌ.

శత — ఓరీ! రేవంతా! కార్యమునుమించివచ్చినదే నేనామణి యెక్కడ సాధింతును. సాధింపకున్న సత్యనాకెట్లుదక్కఁగలదు.

రేవం — (రహస్యముగా) సాధించినను లేకున్నను బరువునకైన మాటయని చూతుము.

శత — మామా! అట్లైన నీవామాటమీఁద నిలిచియుండుము.

వసం — ఓయీ! నిర్భాగ్యుఁడా! ఇప్పటికైన వీఁడు దొంగయాట నీకరూఢమయ్యెనా? ఆమణి వీఁడేహరించినాఁడు. నీవిప్పుడు కూఁతునిచ్చెదనను నాసతోఁ దెచ్చి యిచ్చెదనని చెప్పుచున్నాఁడు.

సత్రా — నాకెవ్వరెట్లిచ్చిననేమి? మణి మఱల నాకులభించుటయే నాకుంగావలసినపని. ఆలాగు మణి యిచ్చినవానికి నాకుమారినిచ్చుట తథ్యము.

వసం—సత్రాజిత్తూ! కన్యావిక్రేతవై యిదివఱకేమాత్రము ధనము సంపాదించినాఁడవు పిల్లనిచ్చెదనని యాసపెట్టి నగలకై దనమియుఁ జీరెలకిందనియు నీశతధన్వు నొద్దనుండి యెంతసొమ్ము లాగినావేమి?

సత్రా—మహాబ్రాహ్మణుఁడవైన నీవు నన్నాక్షేపింపవలసినదే.

కృ—మిత్రమా! ఈశతధన్వుఁడు మణి హరించియే యుండునా యేమి. నిజముగా వీఁడే మణిహర్తయైనచో నాకోరికలన్నియు వ్యర్థములు కదా.

వసం—విచారింతము రమ్ము.

కృ—సత్రాజిత్తూ! నేను నమ్మణికై ప్రయత్నించెదను. నీవనినమాట మాత్రము తప్పిపోకుము

సత్రా—ఇటు సూర్యుండటు నుదయించు నెట్లు?

కృ—అలాగైన మాకు సెలవిమ్ము. వసంతకా! రమ్ము. (నిష్క్రమింతురు)

సత్రా—నేను బోయివత్తును. (నిష్క్రమించును)

శత—అయ్యో! నాయదృష్టరేఖఁ దుడిపింప నీకృష్ణుఁ డెక్కడనుండి దాపరించెనో! అయినను గృష్ణుఁడు చేసినదేమున్నది; అక్కటా! ఎంతలో నెంత వైపరీత్యము జరిగినది.

మ. అకటా! పీఁటలమీఁద పెండ్లి వృథ సే ♦ యన్ వాఁడు నాపాలివేఁ
టకు నేలాచనెనో శ్యమంతకముతోఁ ♦ దక్ మాపై నేనుండదే
టికి జోరుగ మణిన్ హరించి వనవా ♦ టిన్ వాని శాసించె నం
తకుఁ బ్రారబ్ధము నాకురమాణికిన్ ♦ దప్పించె బంతంబునన్.

అయ్యో! రేవంతా! ఇంకను నాకీదురాశయెందులకు అచక్కదనాలముక్క నాంటి నిర్భాగ్యునకు దక్కునా? కాఁగలవివాహమునకిన్ని విఘ్నములేల దాఁపరమగు? మణిగణించి తెచ్చి సత్రాజిత్తున కిచ్చినఁగదా యామచ్చకంటి నాకుభార్యయగుట మాయావియగు గోపాలునితోఁ బ్రతిఘటించి నేను మణిసాధించెదననుట కల లోని వృత్తాంతంబు. ఏమి సేయుదును (ఆలోచించి) రేవంతుఁడా! ఈవిషయమై మనచిరమిత్రుఁడగు శంబరాసురుండేమైన సహాయము చేయునేమో? వాఁడు కంసమిత్రుండగుటఁజేసి కంసధ్వంసియగు కృష్ణునితో నెల్లప్పుడు బలవద్విరోధంబు వాటించుచుండును. మధురాపురంబునకేగి వానింబిలిచికొని వత్తువా!

రేవం—స్వామి యాజ్ఞయైనట్లు.

శత — శీఘ్రింబుగఁ బొమ్ము.

రేవం — (నిష్క్రమించును)

శత — రేవంతుఁడీసరివంతను వాఁడు వస్తున్న పురంబునను౦డ నో లేదో!

రేవం — (ప్రవేశము)

శత — ఏమి రేవంతుఁడా! అప్పుడేవచ్చితివి?

రేవం — శంబరాసురుఁడిప్పటికి వచ్చెను.

శత — ఏఁడీ ఏఁడీ?

శంబ — (ప్రవేశము)

శత — మిత్రమా! అందఱు క్షేమమా?

శంబ — అయ్యో! రామకృష్ణులిరువురు సజీవులైయుండఁగా మాకు క్షేమమెక్కడిది? మఱియు,

శా. శూరోత్తంసుని కంసునిక్కి జెలులతోఁ ♦ జుట్టాలతోఁ సేనతోఁ
గోర్కిఁ జంపిన రామకృష్ణుల శిరం ♦ బుక్కెన్ వెంపై రాల్చి పీ
రారంభంబునఁ దద్గళద్వ్రణవిని ♦ ర్యద్రక్త కల్లోలినీ
ధారాస్నాతుఁడఁగాక నాహృదయసం ♦ తాపంబుచల్లారునే.

శత — (హాస్యముగా) రేవంతుఁడా! వీనికి రామకృష్ణులపై వైరము విస్తారముగానున్నది యిది మనకార్యంబునకు మిక్కిలి యనుకూలముకదా. అదిగాక తలంచిన మాత్రి యీతఁడిక్కడికి వచ్చుటయు మనప్రయత్నంబునకు శుభసూచకంబనియే తలతును. ఏమందువు?

రేవం — అవును. కాఁగలకార్యంబున కెల్లపుడీలాటిశుభశకునములు పొడఁగట్టుచుండుట సహజము. వీనివలన మనపని పూర్తముగాఁ దీఱఁబోదు.

శత — మిత్రమా! శంబర! సమయమువేచియున్న నీకు రామకృష్ణులనాఁటికేని జిక్కక పోరు ఏనాఁటికోయనవేలయిప్పుడు. నామూలకముగా నీకుసమయము దొరకినది

శంబ — అదియేమి? చెప్పు చెప్పు.

శత — నేనువలచిన సత్రాజిత్తుకూఁతును దాఁగూడవలదని నావివాహమునకు భంగము జేయుటకుఁ గృష్ణుఁడిప్పుడు ప్రయత్నించుచున్నాఁడు.

శంబ — పిల్లనిచ్చువాఁడు సత్రాజిత్తు నీపక్షమైయుండఁగాఁ గృష్ణుఁడెట్లు నీవివాహము నకు భంగముగావింపఁగలఁడు.

శత — అవృద్ధరాజునకొకమాటయా యొకపలుకా! తాను ప్రసేనునికారణమునఁ గోలో్ప

★



# సాత్రాజితీయము

## ద్వితీయాంకము.

రంగము—ద్వారకాపుర బాహ్యోద్యానవనము.

[ప్రవేశము శతధన్వుని సేవకుఁడగు రేవంతుఁడు]

(కన్నులు నులుముకొనుచు నోటితోఁ ఆవులించుచు) రామరామా! బొత్తుగా నిద్దురయన్న మాటలేక యావదవయవములన్నియు నుగ్గుఁగొట్టినట్లున్నవి. కనురెప్పలకుఁ గొండంతబరువుగట్టినట్లుండి తమంతట తాముమూతపడుచున్నవి. యెట్లులో ప్రయత్నము చేసి రెప్పలపైకెత్తినా కనఁబడువస్తువులన్నియు నేమో బూచులుగాఁ గనబడుచున్నవి. ఒకపగలా ఒకరాత్రియా. మూడుపగళ్లు మూడురాత్రులు నిద్దురయన్న మాటలేక కన్నపుదొంగలవలె నూరంతయును నేను మాస్వామియగు శతధన్వుఁడు నా తనిచెలికాఁడు శంబరాసురుఁడును మణికై వెదకివెదకి అలసిసొలసి విసికి వేసారితిమి. ముక్కుడిగానిసాలందిను నారకుక్కసింహంకోడుకున కేమి. వాఁడెన్ని రాత్రులైనను నిద్రగాయఁగలఁడు. నేనొక్కక్షణము భోజనకాలమున కాలస్యమైన నోర్తునుగాని నిద్దుర కట్లోర్వను. ఇప్పుడీయుద్యానవనమునకువచ్చు కళావతితోఁ గొన్నిరహస్యములు చెప్పి రమ్మని స్వామియైన శతధనుఁడు నన్నంపె. కళావతి యిచ్చటనున్నదేమో పిలిచెదను (అని) ఓకళావతీ! కళావతీ! (ఎవ్వరు పలుకకుండుటఁజూచి) ఎవరున్నారిచ్చట వల్లకాటివారు అరచి యరచి నాగొంతుపగిలిపోవలసినదేకాని ఇచ్చటపలుకువారెవ్వరులేరు ఆబానిసకూఁతురు నిక్కుచు నీల్గుచు సొక్కుచు సోలుచు నెప్పటికిచ్చటికివచ్చునో! అందనుకనీ క్రొమ్మామ్రవిగున్న నీడఁబరుండి హాయిగా నిద్రాసౌఖ్య మనుభవించెదను.

(పరుండి గుఱువెట్టి నిద్రపోవుచున్నాఁడు)

(ప్రవేశము విదూషకుఁడు వసంతకుఁడు)

మాకృష్ణుఁడేవేళ నాసాత్రాజితిం జూచెనోకాని యాతనివిరహమంతయును ఈముసలివానిచావునకు వచ్చినది. ఆసత్యభామ ఈకదళికారామమునకు వచ్చియున్నదేమో

మాచిరమ్మని నన్నాతఁడు పంపఁగా నిచ్చటికి వచ్చితిని. (అని నడచుచు) ఈ కెలంకుల నెక్కడను జెలువలయలికిడియే లేకున్నది. (అని ముందుజూచి) ఓహో! వీఁడెవఁడు. కృతయుగమునాఁటికుంభకర్ణుఁడు మరల నీద్వాపరమునఁ బ్రత్యక్షమయినాఁడు. ఓసీ! వీనిగుఱ్ఱు క్షీరసాగరమథనధ్వనిని ననుకరించుచున్నది. దాఁకనంటివెడఁద నోరుదెఱచికొని ఈఁగలుమూఁగుచున్నను దెలియక గుఱుముని నిద్దురబోవుచున్నాఁడు వీఁడు రేవంతునివలెనున్నాఁడు. (అని సమీపించును)

రేవం—కళావతీ! యెంతసేపటికి వచ్చితివే? (అని కలవరించును)

వసం—వీఁడేమో కలవరించుచున్నట్లున్నాఁడు. వీ చేత నింకను బేలించెదను. రేవంతుఁడా! యిప్పుడే వచ్చితిని.

రేవం—కళావతీ! శతధన్వుఁడు కృష్ణరూపమునవచ్చుచున్నాఁడు. సత్యభామ నుద్యానవనమునకుఁ దీసుకొనిరమ్మ

వసం—ఎప్పుడు?

రేవం—సందెవేళను పిమ్మట శంబరుఁడు సత్యభామరూపముతో వచ్చును.

వసం—అలాగా? (తనలో) మాయావియైన శతధన్వుఁడు సాత్రాజితినెత్తికొనిపోవుటకుఁ బన్నిన పన్నాగముగాఁబోలును. నేనీవృత్తాంతము మాగోపాలున కెఱింగించి ముందాతని నిక్కడికిఁ దీసికొనివచ్చెదను. (అని నిష్క్రమించును)

[పిమ్మటఁ గళావతి ప్రవేశించుచున్నది]

కళా—కృష్ణునిపైననే కాఁబోలు మేల్పడి మిక్కుటమయిన మదనతాపముచే నస్వస్థతగా నున్న భర్తృదారికకై మృణాళములను లేఁతయరటాకులను గొనిపోవ నేనీయుద్యానవనమునకువచ్చితిని. ఎంతచెప్పినను మాశతధన్వునిమాత్రము సత్యభామ వరించునట్లు లేదు. (ముందు నడచిచూచి) ఏటికో రేవంతుడిక్కడఁబడుకొని నిద్రించుచున్నాఁడు. రేవంతుఁడా! లేలెమ్మ (అని చేతితోఁ దట్టును)

రేవం—గుఱ్ఱుపెట్టుచు పొర్లుచున్నాఁడు.

కళా—చచ్చినవాఁడా! బావురుబిల్లులు పోట్లాడుచున్నట్లున్న నీగుఱుక విని నాకుభయమగుచున్నయది. ఈపాటికి నీవునిద్రలెమ్మ.

(అని కొట్టుచున్నది)

రేవం—(అదిరిపడి లేచి వికారముగాఁజూచుచున్నాఁడు)

కళా—ఓరి కుంభకర్ణుఁడా! నీవఱ్ఱుఁజూపులు మానివేసి యీపాటికినీవు మేలుకొమ్ము

రేవం—ఎవరది. (పరికించి) కళావతీ! నీవఁటే నీకడుపుడక సత్యభామను నేనుచెప్పి నట్లు ద్యానవనమునకుఁ దీసికొనివచ్చితివా?

కళా—ఎవరుచెప్పినట్లు?

రేవం—నేను నీతోఁ జెప్పలేదఁటే

కళా—ఎప్పుడు?

రేవం—ఇంతకుముందే!

కళా—నేనెఱుఁగనే

రేవం—(తనలో) నేనునిద్దురమబ్బునను ఎవ్వరితోనైన నసందర్భముగా వాగితినా యేమి? యేమో కానిమ్ము (ప్రకాశముగా) కళావతీ! స్వామియైన శతధన్వుఁడుగారు నీకుఁగొన్ని రహస్యములుచెప్పుమని నన్నంపెను ఇటువినుము.

(అని తలపట్టుకొనుచున్నాఁడు)

కళా—అక్కడనుండి చెప్పుము. ఇక్కడ నెవరున్నారు?

రేవం—ఓసి పిచ్చిదానా! గోడలకు సహితము చెవులుండునే.

(అని చెవిలో రహస్యమభినయించును)

కళా—మంచి యుపాయమాలోచించినావు.

రేవం—మేమెట్లాలోచించినను నీసహాయము లేనిది శతధన్వునకు సత్యభామ దక్క నేరదు.

కళా—నాచేతనైనన్ని పాట్లుపడెదను. నాబహుమతిమాట మఱచిపోవలదని మీశతధన్వునితోఁ జెప్పుము. ఆసత్యభామ కృష్ణునకుఁ గాకుండ నేనును ననేక మాయోపాయములంబన్నుచునే యున్నాను. రుక్మిణిచెలికత్తెయగు మనసికతో "ఏమే కృష్ణుఁడుసత్యను బెండ్లియాడుటకుఁ బ్రయత్నించుచున్నాఁడఁట. ఈవృత్తాంతము మీదేవితోఁ జెప్పుము. నీకును మంచికానుకదొరకును" అని చెప్పితిని. రుక్మిణియెట్లును కృష్ణునిప్రయత్నము సాగనీయదు.

రేవం—మంచిపనిచేసితివి. నీవు నీశక్తియంతయు శతధన్వునకై దారవోసిపనిచేయుము నీకష్టముంచుకొనువాఁడుకాఁడు.

కళా—చూచెదఁగదా నేను తొందరగా మృణాళములు సేకరించుకొని పోవలయును లేకున్న యూరకయిచ్చుజూచిన మొగము మాడ్చుకొనుచుండు సత్యభామకు నాజంతకోపమువచ్చును. దాస్యమునకై యొకరికి శరీరమమ్ముకొనినప్పుడు స్వ

తంత్రితయొక్కడిది? మూరుచున్న నొకతప్పు నిలుచుండిన నొకతప్పు నీవుపొమ్ము నేను సంజవేళ కీతూఁడా వనవమునకు సాత్రాజితినెట్లులయినఁ దీసికొనివచ్చె దను. శతధన్వని యథావిధిగా గమ్మనుము.

(ఇరువురు నిష్క్రమింతురు)

[ఇది ప్రవేశకము]

[పిమ్మట వసంతకద్వితీయుఁడై కృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు]

వసంతకా! వనమారేవంతుని కలవరింపుఁబలుకులయందు విశ్వాసముంచి యీకద శీతారామమునకువచ్చితిమి. నీవుచెప్పినవృత్తాంత మెంతవఱకునిజమో యూహింప రాకున్నది.

వసం—ఊహించుట కేమున్నది. శతధన్వుఁడును సారేవంతుఁడును నిరంతరమీ దురా లోచనములఁజేయుచుండినఁగాని నిద్రయందుఁగూడ నవి తలఁపునకువచ్చికలవరిం పుల మూలకముగా వెలిఁబడవు. మితిమీరఁ దినకుండఁ గడుపునొప్పిపుట్ట దుగదా!

కృష్ణ—సరియేకాని వానికలవరింపువలన నీవేమని యూహించితివి?

వసం—నీయందు సత్యకనురాగముకలదని స్పష్టముగాఁదెలిసినది.

కృష్ణ—ఎట్లు తెలిసినది?

వసం—నీయందామెకు వలపుండుటంజేసియే నీరూపముధరించి తాను సత్యకడకుఁవచ్చెద నని శతధన్వుఁడు చెప్పినట్లు రేవంతుఁడు కలవరించెను.

కృష్ణ—మిత్రమా! ఈవిషయమైయి నీకున్నంత విశ్వాసము నాకు లేకున్నది ఏమన,

చ॥ పరిచయమేమి చొప్పడదు, ♦ పావనసత్కులధన్యకన్య యీ
నరకె మనోజ్ఞగుణించి యుప ♦ వాదము మోసితినా పెంగ్రడిచే
నిరవనియేమిసేయునది ♦ నేమగునో భవదీయవాక్యముల్
పొరిపొరినూపుచున్నయవి ♦ పో మది నుయ్యాలలీలనానలఁ॥

వసం—పరిచయము నీవకలిగించుకొనవలయునుగాని యూరకయెట్లుకలుగును? అడుగ నిది అమ్మయైనను బెట్టదు. పోనీ నీవామెను చూచితివికదా- యిప్పుడామెను గుఱుతైనఁబట్టఁగలవా? అదిచెప్పు?

కృష్ణ—అయ్యో మిత్రమా! అట్లందువేమి?

చ॥ తలఁపునగట్టిగానిలిపి ♦ ధారణఁజేసి లతాంగి రూపముల్
దలఁచుకొలందినానాలి యు ♦ ధాష్టితి నచ్చునఁబోసినట్లుగా

మెలఁగడు నాసమక్షమున♦ మేనుగగుర్పొడుచున్ యథార్ధవుం
బులకలొ నిర్ణయింపుమివి♦ ముద్దియ! దద్దపుఁజూపుఁదూపులో॥

వసం—ఇవియన్నియు మన్మథపిశాచమావేశమైనప్పుడు పుట్టుచుండు వికారములు

కృ—అహా! భగవానుఁడా! కామదేవా! నీవొక్కఁడవే జగదేకవీరుండవు చూడు.

మ॥ కినుకన్ నిన్నుహరుండు ఫాలనయనా♦గ్నిన్ గాల్చి భస్మంబుగ
న్వినయేనిన్ బెనుబూదివై జగముల్ ♦ వేసి తుపూఁదూపులన్
గొనివజ్రాయుధధారినే గెలిచి ఆ♦ క్కటిఁయాడింపనె
వ్వనినీవేమియొనర్పవంగజ! భవ♦ద్వ్యాపారముల్ చిత్రముల్॥

వసం—మిత్రమా! యీకదళికారామముచూడుము.

కృ—ఈయారామ మాకన్యామణిలావణ్యమే నామస్మరణపుఁదెచ్చుచున్నది చూడు,

మ॥ అళులు, సరోజము, ల్కిసల♦యంబులు, కల్వలు పుష్పగుచ్ఛముల్
నలినమృణాళముల్లసల♦పంటులు, నెన్నడికిన్ లతాంగి సొం
పులఁదలఁపించినాకువల♦పుందమిఁబెంచుచునున్న వింక నే
నలకలవాణితో సరస♦మాడి కృతార్థుఁడనౌట యెన్నఁడో॥

వసం—మిత్రమా! నీవు విస్తరిలో వడ్డించుచుండఁగనే తొందరపడుచున్నావు.

కృ—ఇదిలోకసామాన్యమే చూడు.

గీ॥ వేసఁగికార్యంబు దొరకొను ♦ వేళకన్న
నాస హెచ్చుఫలోన్ముఖం ♦ బగుచునుండ
నధికమగుమిక్కిగానున్న ♦ యదనుకన్న
పెద్దదెచెట్టు ఫలమిచ్చు ♦ వేళనాస॥

వసం—ఇంతకు నీవలపువృక్షము ఫలోన్ముఖమైనదని ధైర్యముకలిగినదా?

కృ—సత్యాగమనపసంతసమయమునంగాని చిగిర్పనేరదు.

వసం—ఆమెనీపాటికీకదళికారామమునకుఁ గళావతితోనిని వచ్చియుండును.

కృ—వచ్చినదేమో చూచెదము ముందు నీవునడువుము.

వసం—నాకు శుభశకునమాయెను. రావలసిన దోనతులచాపక్కడనే రాఁబట్టు
కొందును

కృ—ద్రోవతులచాపుకాదోయీ కంకణములేవచ్చునా.

వసం—నేనికేఁ గంకణములు?

కృ—నీరెండుచేతులకు

వసం—కాదు రెండుకన్నులనుము

కృ—అదియేమి?

వసం—నీవును నీక్రొత్తకన్నియయును మధ్యరాయబారములు చేసినందులకు రుక్మిణీదేవి నావెన్నుపాము విఱుగఁగొట్టుటచేత నారెండుకన్నులకును గావఁసినన్ని కంకణములు అనఁగా కన్నీళ్లు.

కృ—వసంతకా! భయంపడకు.

వసం—నీవుకూడ నాశిక్షలోఁ గొంతపంచుకొందువు గనుక నాకెట్టిభయములేదు.

కృ—సరికాని వసంతకా! యింకను నానెచ్చెలి యిచ్చటికి వచ్చినట్లగపడదు.

వసం—రాలేదని నీకెట్లు తెలిసినది?

కృ—మిత్త్రమా! ఎట్లుతెలిసినదా! మాడుమిచ్చట,

ఉ॥ తరుసంతానము నూత్నదోహదనితాం ♦ తశ్రీల నింపారలే
దరయన్ దెమ్మెరకున్ గురంగమదగం ♦ ధామోదమేలేదు నా
సరసాలాప వయస్యలన్ గలిసి ము ♦ చ్చట్లాడినట్టీవనాం
తరమందున్ బ్రవహింపలే దురుసుధా ♦ ధారాపరీజ్ఞాలవుల్॥

వసం—ఆలాగైనఁ గొంచెము ముందునకుపుము

కృష్ణ—(నడచుచు) మిత్రమా! ఇక్కడనిలుము నాచెలియచే దోహదక్రియలంగాంచి ఏర్డిల్లు నీవనస్పతులేమయిన నాయమరాక యెఱుంగునేమో యడిగి చూచెద,

మ॥ మెలఁతన్ గాంచితివే యశోకమ! యిదే ♦ మేపల్కవాకల్కిపై
సలుకాంతన్ గటంచునన్న? సురపొన్నా! నిన్నునుం గన్నెన
వ్వులపాల్సేయుచటంచు నల్కవినలే ♦ వోమూంట! నీవేసియున్
దెలియంబల్కరసాలమా! చెలినుగన్ ♦ గేలంటిలాలించెడిన్॥

(కొంచెమాలోచించి) మిత్త్రమా! నాపల్లవపాణికెమ్మోవి తనచిగురాకువన్నియునపహాసించుచున్నదను నీరసము చేఁగాఁబోలు నీరసాలమును నాసుదతియెడఁగోపరక్తి మునీవహించి యూరకున్నది చూడుము

వసం—యేటితో లేదు దానిమూఁగసైగలు నీకుఁదెలియలేదు కాని పిల్లగాలిచే మెల్లఁగాఁ గదలుచున్న తనచిగురాకు చేతులతో నీచెలియ యీవంకగా వచ్చుచున్నదని

నీకుఁ జెప్పుచునేయున్నది చూడు మాప్రక్కనుండి మబ్బులవలెగూడ నిట వచ్చుచున్నది.

కృ—(చెవియొగ్గి) నిజమేసుమీ !

గీ. పట్టణాగుత్తివై పొదరిండ్లు ♦ దాఁటి యిటకు
వచ్చుచున్నది చూడు నా ♦ ప్రాణపదము
నిబిడమగు మేఘపంక్తుల ♦ నతిక్రమించి
జోక నేతెంచు జాబిల్లి ♦ రేకవోలె.

వసం—ఏదీ ఏదీ ఎక్కడెక్కడ. (అని చిందులు త్రొక్కుచున్నాఁడు)

కృ—మూర్ఖుఁడా! నీవు ప్పెల్లరిసేయకుము. నిన్నుఁ బెద్దమర్కటమనుకొని స్త్రీజనము బెదరిపోవును.

వసం—పెద్దమర్కటము సేయైనరాముల నే గొప్పవాఁడనే యగుదును. ఆజాతియేకదా సముద్రమునకు సేతువుగట్టినది.

[పిమ్మట యథోక్తముగా సాత్రాజితీ, కళావతీ మంజువాణులతోఁ బ్రవేశించుచున్నది.]

మంజు—భర్తృదారికా! ఇటు యిటు.

కళా—నెచ్చెలీ! రమ్మా. ఈకపలికగోరామను చిగురాకుచేతులతో నిన్ను రా రమ్మని పిలుచుచుఁ జిలుకపలుకులచేఁ గుశలప్రశ్నలనుగుచున్నది.

సాత్రా—కళావతీ ! నేనును నా నెచ్చెలులైన యిచ్చటికొన్నితీవియల నట్టిట్టులాదరింపవలయునో యట్టులే యాదరించెదను. ఆవైపునకుఁ బోవుదము రమ్మా.

కృ—వయస్యా! ఈమెసౌందర్యం బసదృశముగదా చూడు,

చ. పొలఁతుక నెన్ని వాళ్ళ తల ♦ పోసి సృజించెనో యవ్విరించి, యా
కళుకుఁగనుల్కపోలముల ♦ కాంతియుఁ బల్చసినోవితిపి, వ
స్తులనుచపాళిసంపదయు ♦ దోర్యుగలీల పిఱుందుచందమున్
మలచినరీతి దాపెనక్రి ♦ మమ్ముఁగ్రిర్చినయట్లు రాజిలెన్.

మిత్రమా! ఈకన్యారత్నమును జూచుటకు నాకు నేత్రద్వయముచాలకున్నదికదా!

వసం—ఎట్టులో యింద్రుఁడు వేయికన్నులను సంపాదించినాఁడు నీవట్లు చేయక పోయితివి.

కృ—వసంతకా! నీవిప్పుడు హాస్యములు చాలింపుము. తదేకనిష్ఠాగరిష్ఠుఁడనై నాయన్నుమిన్నం గన్నులారఁ గాంచెదను.

శా. ఆమూలంబుగఁ బుక్కిరించెడి వయ ♦ స్యా! మేను, పూఁబోఁడినె
మోమ్ముందామరపై, విశాలనయనం ♦ పుంగవ్వప్రాదోయిపై
సామోదస్తనమంజరీయుగళిపై ♦ సన్యాంతమార్గ సైలీ
లామోదంబున మర్కటాక్షమనుపం ♦ బాసక్తిఁ గ్రీడింపఁగన్.

వసం—వయస్యా! నీవు క్షణమాత్రమూరకుండుము. ఈచెలసంభాషణము విందము.

కృ—అలాగైన వారికి నగపడకుండ నీపూవుటీగ మాటునఁ బొంచియుందము రమ్ము.

(అట్లు చేయుచున్నారు)

కళా—(స్వగతము) శతధన్వుఁడు రేవంతునితోఁ జెప్పిపంపిన సెలవుప్రకారమాతని కోరిక దీర్చుట కేదోయొకమాయోపాయము బన్ని భర్తృదారికను నిక్కడకుఁ దీసికొని వచ్చితి శతధన్వుఁడును కృష్ణరూపంబుధరించి యీపాటికిక్కడకు వచ్చియేయుండును. ఆతఁడేలాగో యీసాత్రాజితిని నేఁడె త్రిప్పికొనిపోకమానఁడు. కృష్ణుఁడే తనకుఁ బెనిమిటి గాఁగలఁడని తలఁచుచున్న భర్తృదారిక పొంగింతయు నేఁటితోఁ జల్లారును.

మంజు—ఏమే కళావతీ! ఇప్పుడెందుకే పడిపోయినట్లు నన్నును భర్తృదారికను నీసందివేళ నిక్కడకుఁ దీసికొనివచ్చితివి?

కళా—మంజువాణీ! ఇంతలోనే యలసిపోయితివటే. చేతులార మనము నాటికొనిన పూలతీఁగలకు నీరుపోసి తగిన తరువులను నల్లుపెట్టకపోయినయెడల వానికిఁ జక్కఁదన మెట్లువచ్చునే?

సాత్రా—ఔనే కళావతీ! నీవు చక్కఁగాఁ బలికితివే.

కృ—వసంతకా! ఈకళావతి పలుకు పొగడఁదగియున్నది చూడుము,

గీ. ఒకరికొకరీడుజోడుగ ♦ నుండకున్న
నాయికానాయకులకేమి ♦ హాయిగలదు
లతలకుందగు జెట్లు చె ♦ ట్లకునుదగిన
లతలుగూడనిచోటఁ ♦ జెల్వంబుగలదె.

కళా—భర్తృదారికా! ఇక్కడఁజూడుము; దట్టముగా వేసిన చలువపందిళ్ల నల్లుకొని నిండా

గంబూచిన సన్నజాజులమీఁదను బండిగురివిందపూవులమీఁద గ్రవాలి తీయనితేని యానగ్రోలి యటుపిమ్మట నాగూఁ ననుదురబండిన నవసపండులలోని యోఁడి కలఁ జవినూచుటకు నేమో సరసములాడుకొనుచున్నట్లు ఝుంఝుమ్మనుచుఁ బరువెత్తుచున్న యీ తేఁటిదంపతుల కోలాహలము గనుము.

సాత్రా—కళావతీ! అదేమోకాని యీ తేఁటిదంపతుల కోలాహలము నా చెవులకుఁ గటువగుటయేకాక తలదిమ్మగూడ ఘటించుచున్నదే.

కళా—ఆఁగాగా! ఇంతకు నీమనస్సెక్కడ లేదులే.

సాత్రా—(కొంచెము కోపముతో) మఱియెక్కడనన్నదే?

కళా—ఎక్కడ నెందుకుండును? యెల్లకాలము నీకా (శంకించి) యెందుకులే.

సాత్రా—కళావతీ! ఏమిసరసములేయివి?

కళా—ఏమి సరసములా? పెండ్లిసరసములు.

సాత్రా—ఎవరిది పెండ్లి?

కళా—ఎవరుతొందరపడుచున్నారో వారిది.

సాత్రా—చాలుఁగాలే నే నేమియుఁ దొందరపడుచుండుట లేదు.

మంజు—అలాగైన నీకేమియు లెలియదుగాని పెండ్లియనఁగా నాకొకచిత్రమయినయూహ తోఁచినది; భర్తృదారికా! పుష్పొడియను పసపుఁజీర ధరించి చిగురుదోయిఁటితో మొగ్గలను ముత్తెంపుసేసల నీసురపొన్నపైఁ బోయుచున్న యీమాధవీలతిక యేలాగున్నదో గనుము;

కళా—భర్తృదారికా! యేలాగున్నదోఁ జెప్పనా?

సాత్రా—చెప్పు.

కళా—రేపు నీవు పెండ్లికూతురవై శతధన్వునిపై నెగసి యెగసి తలఁబ్రాలు బోయునప్పు డేలాగుందువో యాలాగున్నది.

సాత్రా—కళావతీ! చాలును. ఆశతధన్వునిపై నీకున్న బాళియంతయుఁ బైకిఁబోఁగుచున్నావు కాఁబోలు యీలాగనఁ బరిహాసములాడుచుండు నీకడ నే నెందుకు నిలువవలయు? మఱియొకచోటికే పోవుదును; మంజువాణీ! రావేపోదము.

(మంజువాణి చేయిపట్టుకొని పోవుచున్నది.)

కళా—పోనీ! నీకింతలో నే కోపమయిన నేనే వెళ్ళిపోవుదును. (స్వగతము) ఏలాగో నేనిక్కడనుండివెళ్ళి కృష్ణునిరూపముతో వచ్చిన శతధన్వుని యీమెకడకంపి దీని

తుత్రిశ్ఛష్టంగింపవలయుంగదా. ఇప్పుడు నాకిది యొకమిషగూడ దొరకినది.

(పరిక్రమించును.)

కృ—మిత్రమా! ఈకళావతిపట్టుపట్టి యీకన్నియను శతధ్వనునికే యిప్పించి తనపంతము నెగ్గించుకొనునా యేమి?

వసం—పద్మినికిని దోషాకరుండైన చంద్రునకును నెవ్వరు సంబంధము కలిగింతురయ్యా అందుచేతనే శతధన్వునిపేరు వినినతోడనే నీనెచ్చెలిముఖవైఖరి యేలాగున్నదో దానినైన యోజింపవేమి?

కృ—నిజమేసుమీ చూడు,

ఉ. ఇంచుక లేచియల్క నటి • యించి ముఖాబ్జము లేఁతసిగ్గునన్
వంచుటకన్యకాతతికి • నైజము కాఁగల భర్తపేరు సూ
చించుచు నెచ్చెలుల్ పరిహా • సించునెడన్ జిగురాకుమోవిపైఁ
గొంచెపు నవ్వుదోఁగలుగు • గూరిమి చెప్పక చెప్పుచుండెడిన్.

అట్టిమంచిహాస్యాదికంబు లేయయు లేక శతధన్వునిపేరు వినినతోడనే చిడిముడిపాటుతోఁ బెడమొగంబయి నానెచ్చెలి యూవలకుంబోవుటఁ జూడఁగా నాకిప్పుడూపిరివచ్చినట్లే యున్నది.

వసం—వయస్యా! అదిగోఁ గళావతి యీలాగున వచ్చుచున్నది. నేను నీకడనుండఁగా నాబానిసకూఁతురు చూచినదా నన్ను దెలిసికొనును. కావున నేనీ పొదయందు దాఁగియుండును. అప్పుడు గని నీగూఁపముతో వచ్చిన శతధన్వునిగా నిన్ను జూచి పొరపడును.

కృ—.అవును నీవాయీరమునందు ఉండు.

వసం—[అట్లు చేయుచున్నాఁడు.]

కళా—(ప్రవేశించి) ఇంకను మాశతధన్వుఁడు కృష్ణరూపము ధరించి రానేలేదేమి (నడుచుచు) ఇదుగో ఏమండీ శతధ్వనుఁడు గారూ!

కృ—శతధన్వుఁడెవ్వఁడే?

కళా—ఎవరన్నవారే.

కృ—ఓసీ! పిచ్చిదానా! నేను కృష్ణుఁడనే.

కళా—ఔనులెండి నాకుఁ దెలుసును దొంగకృష్ణుఁడవు.

కృ—కళావతీ! ఎట్లుకనిపెట్టితివే?

కళా—ఓయబ్బో! నేఁడీసినగుంటలో నేనీఁదుదునా యేమి!

కృ—నీవు మాయలమారితనమున నందెవేసినదానవే కాని నన్నిప్పుడు శతధన్వుఁడని యెవ్వరైనఁగనిపెట్టఁగలరా?

కళా—మొట్టమొదట నేనే పొరపాటువడనంటిని. ఇప్పుడుకృష్ణునకును నీకును నేమియు భేదము లేదు.

కృ—నన్నిప్పుడానన్నెలాడి వరించునా?

కళా—ఇంకేమిసందేహము కృష్ణుఁడే తనకుఁ బెనిమిటికావలయునని యూటక యువ్విళ్ళూరుచున్నదికాని యాసత్యభామ యెట్లైనను నీవిప్పుడేదానిదక్కించుకొనుము

కృ—కళావతీ! ఇదియంతయు నీవుచేసిన సహాయమేకదా నీయుపకారఋణము నేనెట్లు దీర్చుకొందునే

కళా—ఎట్లు తీర్చుకొందువో చూచెదఁగద. ముంజేతులకంకణాలకు నద్దాలెందుకు? కుడువఁబోవుచుఁ గూరాకు రుచియడుగుటయెందుకు. నేనిఁకఁ బోయెదఁగాని నీవు మెలఁకువతోఁ గార్యము సాధించుకొమ్ము

కృ—పొమ్ము

కళా—(నిష్క్రమించును)

కృ—దీనిమాటలంబట్టి విచారింపఁగా సత్యకు నాయెడ ననురాగమున్నట్టు తోఁచుచున్నది.

వసం—(హఠాత్తుగాఁ బరువెత్తుకొని వచ్చి) వయస్యా! నాకు నిప్పుడు నవ్వునిలుచుట లేదు. ఆతొత్తుకూఁతురుకంటె బాగుగా దుమ్ముదులిపినావు. దాని ఋణమేమి తీర్చెదవుకాని యొక్క పాతిక పుంజీల వడలతో నాఋణము నిరవశేషముగాఁ దీఱిపోవును. నీవట్లు చేయుము

కృ—అలాగుననేకాని నీవిప్పుడల్లరిచేయకుము. ఆయిట్టిచూపుల కళావతి యెక్కడనైనఁ బొంచియుండి మనలను మిట్టిచూపులఁ జూచుచున్నదేమో.

వసం—దానికిఁదగిన వేఁటకాఁడను నేనిక్కడనే యున్నానుకదా. నీవిప్పుడు నిశ్శంకముగా సాత్రాజితితో మాటలాడవచ్చును. అదిగో నామె సంజువాణితో నీలాగే వచ్చుచున్నది.

సంజు—భర్తృదారికా! కళావతి కోపమువచ్చి వెళ్ళనే వెళ్లెనుగదా.

సాత్రా—మంజువాణీ! పోనిమ్ము. కదా నిన్నదేమన్నది. అదే నన్నెప్పుడు పుల్లవిఱుపుమాట లనుచుండును. నాతండ్రి నాకుఁజేసిన యుపకారమునకే నేను కృశించుచుండఁగా మీఁదుమిక్కిలి కళావతిగూడ సూటిపోటిమాటల నన్ను బరిహాసము లాడుచుండును.

కృ—వయస్యా! ఈయువతికు సత్రాజిత్తుచేసిన యుపకారమేమున్నది?

వసం—నిన్ను నింటికిఁబిలిచి యీామెను నీకిచ్చి వివాహముచేయకపోవుటకన్న నామెకింకేమియుపకారము చేయవలయును?

కృ—నీవూఱక నాకాసలుపెంచుచున్నావు.

మంజు—ప్రాణసఖీ! నీతండ్రి నీకేమియుపకారముఁగావించెనమ్మా?

సాత్రా—నావివాహవిషయమయి యతఁడు నాకుఁజేసినదపకారముగాక మఱియేమిలే?

కృ—వయస్యా! ఆకన్నియ తనవివాహవిషయమయి ప్రసంగించుచున్నది. నీవును శ్రద్ధతో నాకర్ణింపుము.

వసం—వినుచున్నాను.

మంజు—నెచ్చెలీ! ఏమన్నావు?

సాత్రా—ఏమనుకొన్న నేమిప్రయోజనమే

చ॥ వరునికులంబు, శీలమును, ♦ బ్రాయమునారసి కన్నెమానసం
బరసినపిమ్మటన్ బరిణ ♦ యంబొనరించుట పాడిగాక ని
ష్ఠురముగఁ బైడికాసవడి ♦ శ్శుద్రునికొక్కనిఁగట్టి సూతుకా
పురమును గూల్ద్రోయుతల ♦ పు ల్దలిదండ్రులకుంటధర్మవే॥

మంజు—ప్రియసఖీ! నీతండ్రి పైఁడి కాసవడి నిన్నిప్పుడెవ్వని కీనెంచియున్నాఁడు?

సాత్రా—ఎవ్వనికనిచెప్పను. శ్యమంతకమణి సంపాదించి తనకెవ్వఁడిచ్చునో వానికి?

మంజు—దానికై యెవ్వఁడు ప్రయత్నించుచున్నాఁడో

సాత్రా—మఱెవ్వఁడున్నాఁడు నాదురదృష్టదేవునివలెనున్న శతధన్వుఁడుతప్ప

మం—ఆపాడు శతధన్వుఁడు నీకు బొత్తుగాఁ దగనివాఁడే సుమీ

సాత్రా—మంజువాణీ!

గీ॥ త్రాచుపామును మెడలోనఁ ♦ దాల్పవచ్చుఁ
గాలకూట విషంబును ♦ గ్రోలవచ్చు

చిచ్చునందేహమిచ్చమై ♦ చేర్పవచ్చు
చెనఁటిశతధన్వునివరించి ♦ చెడుటకన్న॥

కృ—వసంతకా! శతధన్వుఁడే మణిసంపాదించి తెచ్చి తన్ను వివాహమాడునేమోయని యీయమ మిక్కిలి శంకించుచున్నది సుమీ.

మంజు—ప్రాణసఖీ! కొన్నినాళ్ళనుండియు నీవేలాగో కనబడుచున్నావు. అరవిడిచిమాతో నైనమాటాడవు. పెంపుడుచిలుకకుఁ జక్కెర దినిపించుచుఁ బలుకుల నేర్పవు ముద్దుముద్దుగా వీణెయుంబలికింపవు. ఏకాంతమున నీలో నీవేయేమేమో గొణుగుచుందువు. వెన్నెలరాత్రులయందు మునుపటివలె మాతో (గీ)తింపవు. అదియుంగాక నీమనికిఁజూడ నెవ్వనినో యొక్కమహాపురుషునకై మేలుపడి నట్లున్నది.

సాత్రా—(నిట్టూర్పు విడుచుచున్నది)

మంజు—నెచ్చెలీ! ఏమో యాయాసపడుచున్నావేమిటే?

కృ—వయస్యా! మంజువాణి చెప్పినట్లేమె యెవ్వనికొఱకో తీవ్రమైన మన్మథార్తికిఁ జిక్కియేయున్నది. చూడు,

చ॥ పడఁతి కపోలముల్ సగము ♦ పండిన మేల్తమలంపుటాకుకై
వడిఁ జెలువారెఁ గ్రొంబసిమి ♦ వన్నియ యొడివి పాండురచ్ఛవిన్
యుడుగసివేడియూర్పులను ♦ నుగ్గలిలేఁజిగురాకు మోవియున్
గడువసివాడియున్నయది ♦ కన్గవనిద్దుర లేమిఁ గెల్పెడున్॥

సాత్రా—(ఉలికిపడుచున్నది.)

మంజు—ప్రియసఖీ! ఏమేయట్లులికిపడుచున్నావు? వట్టివెఱ్ఱిబాగులదానిని నేనేమియు నీలాటిసంగతుల నెఱుంగను. ఎందుకే నీకింతపరితాపము?

సాత్రా—మంజువాణీ! నేనీపరితాపముతో బ్రతుకుట దుర్లభమే

మంజు—అయ్యో! నేనిప్పుడేమిచేయుదునే (తత్తరముతో కదళీకాపత్రాదికంబులఁగొని వచ్చి) భర్తృదారికా! ఇవిగో యీమంచుతుంపురులపైనఁజల్లనిమ్ము. గంధమలందనిమ్ము శీతమైన యీయరటాకులపైనఁగప్పనిమ్ము. ఇదిగోఁ బచ్చకర్పూరపు దుమ్మారమూదనిమ్ము చల్లనితామరపాకు వీవనలను వీవనిమ్ము (అట్లుచేయుచున్నది)

సాత్రా— మంజువాణీ! నిష్కారణముగా నీవెందుకాయాసపడియెదవే. నెచ్చెలీ! యిప్పుడు నాకుఁ దాపమినుమడియగుచున్నది.

కృ— మిత్రమా! ప్రకృతిసుకుమారమైన యీకామినీమణి శరీరమున కింత యాయాసముఁదెచ్చి పెట్టిన యాకఠినాత్ముఁడెవఁడో!

గీ॥ అరయ నేపుణ్యపురా ర్తినా ♦ మాక్షరములు
చెలియమదిఁ పడినెన్నంపు ♦ మొనకెలయ్యె
నేమనోహరుఁడీకామి ♦ నీమనంబు
చూఱఁగొని జన్మసార్థక ♦ స్ఫురణఁగాంచె॥

వసం— మిత్రమా! నీవుగాక మఱెవ్వరుకారుగాని తత్తరపడకు

మంజు— భర్తృదారికా! నీవునాప్రాణసఖివిగాన నడుగుచున్నాను. పద్మినిచేతసూర్యునివలె నీచేతఁ బ్రేమింపఁబడిన యారసికశిఖామణి యెవ్వఁడే?

సాత్రా— మంజువాణీ! అదృష్టహీనురాలనైన నేనుదుర్లభజనానురక్తనైయీలాటిదురవస్థకుఁ బాలైతినిగదా

మంజు— నీకును దుర్లభుఁడైన యంతమహాపురుషుఁ డాతఁడెవ్వఁడే?

సాత్రా— మంజువాణీ! నాకేకాదు సిద్ధవిద్యాధరాది దేవకన్యలకేనియు నతఁడు దుర్లభుఁడే నే.

మంజు— అతఁడెవ్వఁడో నాచెవినివేయవుగా?

కృ— వసంతకా! ఎట్లయినను నాకోర్కె కడముట్టుసమయము వచ్చినది. మంజువాణీ ప్రశ్నమునకీమె యేమనిప్రత్యుత్తరంబిచ్చునో

గీ॥ తత్తరపడుటాసనల్లాడు ♦ చిత్తమునకు
వెలఁదివాక్యంబుసుధయానో ♦ విషమెయగునో
దప్పవడి మిన్నుజూచు చా ♦ తకమునోటఁ
బడునదదివానచినుకో ♦ స్ఫరపుఁబిడుగొ॥

మంజు— ప్రాణసఖీ! మాటాడవేమి. నినునమ్మిన నెచ్చెలినైన నాయొద్దఁగూడ నీకు బేలుతనమేలాగే?

సాత్రి—మంజువాణీ! నిన్ననున్న నోరెత్తనీయకున్నను నెట్టులో చెప్పెద.

మంజు—చెప్పుము

కృ—వయస్యా! నీవును శ్రద్ధతో వినుము.

సాత్రి—

సీ. ఎవనిజన్మమున యమూ ♦ దవవంశముఖ్యులెక
గణ్యమై పుణ్యవ ♦ రేణ్యమయ్యె
నెవనిచారిత్రంబు ♦ భవపాతకలతాల
విత్రమై భువనప ♦ విత్రమయ్యె
నెవనిరూపముగోప ♦ యువతీమనోభాగ
ధేయమై మునిజన ♦ ధ్యేయమయ్యె
నెవనిశౌర్యము నిర్జ ♦ రవిరోధికాంతావి
లాపమై త్రిజగత్క ♦ లాపమయ్యె
గీ. చేడె కుక్షికి యెవ్వాని ♦ జెట్టఁబట్టి
ధన్యయై కాంతలందు మూ ♦ ర్ధన్యయయ్యె
ఆసొగసుఁగాఁడు దీనుల ♦ కైనవాఁడు
గోపికలజోడు నామదిఁ ♦ గొన్నవాఁడు.

వసం—వయస్యా! విన్నావుకదా.

కృ—వసంతకా! నేనుబయలుపడుట కిదియేమంచి సమయము. నీవీ యుద్యానవనద్వారమున నొకయోరనుసందాగియుండుము. శత్రువెవ్వఁడు గాని మఱియెవ్వఁడుగాని వచ్చుచుండిన ముందుగా సూచనఁదెలియఁజేయుము. నీవుచట్టియోటినోటివాఁడ వీరహస్యము బయలుపరచక నోరుమూసికొనియుండుము.

వసం—ఇదిగో నేను నోరుమూసికొనియే పోవుచున్నాను. (పొదయందుదాగును.)

సాత్రి—మంజువాణీ! అందరానిమ్రానిపండున కఱ్ఱుసాచి నేను పరిహాసపాత్రురాలనైతిఁగదా. లేకున్న జగన్మోహనసౌందర్యవంతుఁడయిన కృష్ణుఁడెక్కడ, నేనెక్కడనే!

కృ—(ఎదుటికివచ్చి)

మ. ఎవనిన్ దుర్లభుఁడంచు నెంచెదో లతాం ♦ గీ! నాఁడె నీకే మనో
భవసంతాపమునన్ దహించుచుఁగదన్ ♦ భారంబుగాఁ దీర్ఘపుం

బవళుల్ రేలుఁ బుచ్చుచుండెనళినీ ♦ పత్త్రోల్లసచ్ఛయ్యలన్
నవనీహారపయోమిళన్మలయజ ♦ స్నానోపచారంబులన్.

సాత్రా—(సంభ్రమమున లేచి సిగ్గుతో) మంజువాణీ! ఈరీతి మనప్రసంగమంతయు విననే వినెనుకాఁబోలు. (పూవుటీరము మాటున దాఁగును)

కృ—నెచ్చెలీ! నివ్వెరపడి సిగ్గుచేఁ గలదు లేదనునట్టులున్న నీయన్నువ గౌనసిరూపుఁ బూవుటీరముమాటున కేలపోయెదవు? మనోహారిణీ!

చ. త్వరపడి పోవఁబోకు తెఱవ ♦ ఓ! వెఱవారె వరించు? మన్మథ
జ్వరపరితాపతప్తము భ ♦ వత్పులపాలిక యిప్పు డల్లతె
మ్మెరలయినన్ సహింపదు సు ♦ మీ, మరి గాడ్పులకేమి, తెమ్మెరల్
మురియుచు నీముఖాబ్జముఁ ♦ జూఁగనెంచెరకుఁ బూవుటీరమున్

(సమీపించి)

(స్వగతము) ఆహా! విభ్రమవిలాససముత్సాహాలాదియౌవనచేష్టాలక్షితంబయిన యీ లజ్జావతీమూర్తి యిప్పుడు నామానసంబును మఱింత నాకర్షించుచున్నది. ఆహా! యిప్పుడీమెయందు

మ. శ్రమమహామూర్తి నహించె హావ, మవతా ♦ రంబెత్తి వర్తించె వి
భ్రమమాకారముదాల్చె భావము, సురూ ♦ పవ్యక్తమయ్యెన్ విలా
సము, మైదాల్చి చరించె లీలయు నిమే ♦ ష్ఛన్ దాదృశంబైన యీ
కమనీయాకృతి కామసృష్టికి నలం ♦ కారంబుగా నెంచెనన్.

సాత్రా—(స్వగతము) అయ్యో! ఈపాపిష్టిసిగ్గుచేఁ బ్రియునితో నోరారమాటాడుటకుఁగాని కన్నారఁజూచుటకుఁగాని శక్తురాలనుగాకుంటిగదా! నీవిప్పుడు ప్రియున కేమని ప్రత్యుత్తరంబిచ్చిన బాగుండును. ఇట్లని మాంచెదను. (ప్రకాశముగా) మంజువాణీ! ఇదియేమిటే పట్టపుదేవియైన రుక్మిణియందు బద్ధానురక్తమైనతనమనస్సును నానిమిత్తమున నీతఁడెందుకు నాయాసపెట్టుకొనవలయునే?

మంజు—ఏమోనే! నాకీలాటిసంగతులు తెలియవే (నేనుపోవుచున్నాను.)

సాత్రా—మంజువాణీ! నేనును వచ్చుచున్నాను. [పోఁబోవ]

కృ — నెచ్చెలీ! ఆఁగాగైన నేను నిన్నాశ్రయించికొని రావలసినవాఁడనే [చేయి పట్టుకొనును]

సాత్రా — [చేయియిచ్చి యావలమోమయి] పల్లవపల్లవా! నిన్నాశ్రయించుకొనియున్న యన్నమిన్నలు వేనవేలున్నారు

కృ — కలికీ! వారందఱికి నీవగ్రగణ్యనయ్యెదవు అదియుంగాక, పుష్పబాణుని జయింప నీవులేక యెందఱున్న నేమిప్రయోజనము మాకు.

మ. కిలుకుంజూపులఁ దూపులన్ బొమల సిం ♦ గారంబునన్ జాపమున్
జిలుగుంబల్కులఁ జిల్కరాయురదముల్ ♦ శృంగారవేణీరుచిన్
గలిగుజ్యాలతికన్ జయించి, సుమబా ♦ ణప్రాజ్యసామ్రాజ్య ని
స్తులభోగంబులఁ దేల్చ నీకొలఁది యుం ♦ దుల్లేరు నాకెవ్వరున్.

సాత్రా — కాముకా! నీవంటి రసికులైన పురుషులు మావంటి ముగ్ధాంగనల నీలాటిపలుకులచేతనే లోఁబఱచుకొందురు.

గీ. పదుగురిల్లాండ్రలో వేగ ♦ నన్ను భద్ర
యింపనగుగారములు మొగ ♦ మిచ్చకముల
నవతనెటు చేర్చవలయునో ♦ యెఱుఁగఁజేరి
క్షణము నిగ్గించుకొనలేఁదు ♦ కాపురంబు.

కృ — మానినీ! ఏమి నీవు నన్నింకను సందేహించుచున్నావుగదా. నిన్ను నేనెట్టి యసామాన్యపతిభక్తిచేఁ జూచెదనో నీవఱుఁగఁగలవు. విశేషించి,

మ. తరుణీ! నీకై విధివాణిఁబోలెమిని నా ♦ స్యాంగంబునందుంతునో
మురవిద్వేషిసిరిన్ బలెన్ నిను నురో ♦ భూమిన్ బ్రతిష్ఠింతునో
హరుఁడా పార్వతినెట్లొ యట్లెనిను న ♦ ర్ధాంగంబునన్ దాల్తునో
త్వరలోఁ జూపెదనేను నేఁదఱిమి చె ♦ ప్పన్ ముందుగా మానినీ!
అన్నమిన్నా! ఇప్పటికైన నన్ను గన్నెత్తి చూడుము.

సాత్రా — ప్రియా! నేను స్వతంత్రురాలనుకాఁగదా మాతండ్రిమాపితండ్రికారణమున గోలుపోయిన శ్యమంతకమాణిక్యం బేలాగునైన సంగ్రహించి తెచ్చి నాతండ్రికి

చ్చిన నతయుం జక్కెంబనును. కరుణించి తదన్వేషణమునకై త్వరపడి యేగితెచ్చి నన్ననుగ్రహింపవలయు.

కృ — దీపికా నీవుసందేహించుచున్నావు. దేవీ! నీవు మేరువునుదమ్మన్నను నేను తేకుందునా ? ఇంక విచారంబుమానుము,

* మణిగణనికరవృత్తము *

మతివెతవిడువుము ♦ మణివెదకి జగ
త్త్రితయమునను నెల ♦ దినముల మితిలోఁ
జతురతఁబడసి యొ ♦ సఁగి వినుమిఁక నీ
పితరునిమతిదని ♦ పెదగుణవతిరో !

సాత్రా — ప్రియా ! అలాగైనఁ ద్వరపడుము. నన్నుమాత్రము మఱవకుండుటకీహారము యొద్దనుంచికొమ్ము.

శా. మారాగ్నిన్ దెగఁగాగ్రి నీలమణిదా ♦ మంబైన ముక్తామణీ
హారంబిచ్చెద నీకు సంగద నను ♦ గా! నాదుచిత్తంబుతో
నేరాత్రింబవలుండెదన్ మఱతు సుమీ ♦ నన్నా! నీరాకకు
న్నేరాసన్ దివసంబులన్ క్షణములన్ ♦ లెక్కించుచుండున్ బ్రియా!

[హారమిచ్చుచున్నది.]

కృ — దేవీ ! ఇది కామదేవుని ప్రసాదము గావునఁ గన్నులనద్దుకొనియెద. (అట్లొనర్చి) నెచ్చెలీ ! ముక్తామణీమాలికా! నీవుగదా యింక మాయనురాగలతకుఁ జక్కని దోహదంబిచ్చి వృద్ధిపొందింపవలసినదానవు. మాకు నీయట్టియాప్తబంధువు లింక లేరు.

మ. రమణీరత్నము నీమదిన్ గల గుణ ♦ ప్రాశస్త్యముం జేసి తాఁ
గమనీయుస్తనసీమమై లసదలం ♦ కారంబుగా నిన్నుదా
ల్చి మనంబిచ్చి ప్రియాళివంచు నిను బంచెన్ ♦ స్వప్రియున్ గూర్పను
త్తమముక్తామణిమాలికా! యిఁకను దా ♦ త్యం బొల్లుగావించెదో

మంజు — [అవ్వలనుండి] భర్తృదారిక ! త్వరపడుము; త్వరపడుము. సాయంకాలమగుచున్నది, చూడు;

గీ॥ తను విడిచి నూత్నపద్మినిఁ ♦ దవిలి ట్టి
పెరిమిటియునుండు వద్మినిఁ ♦ గని యనూనుఁ
గోపర క్తిమచే నెదు ♦ ర్కొనియె నళిని
నపరకాంత యదేమాడు ♦ మంబుజాక్షి!॥

సాత్రా — ప్రియుఁడా! ఆలాగైన నేద్వరపడవలదు.
కృ — నేనును ద్వరపడుచు నేయున్నాను.

(ప్రిమ్మట మదనికతో రుక్మిణి ప్రవేశించుచున్నది.)

మద — అమ్మా! రుక్మిణీ! ఈయుద్యానవనమునఁదప్పక వెన్నదొంగను చేఁబట్టి నీకీయఁగలను రమ్మా. [అని నడుచుచు] ఇదిగో గర్భితుఁడైన వసంతకుఁడు బావురుబిల్లివలె నీపొదలో దాగియున్నాఁడు. వీనినదలించి వృత్తాంతమరయుదము.

రుక్మి — ఎక్కడెక్కడ [అని సమీపించును.]
వసం — [తనలో] అయ్యో! నేనిప్పుడు చావనేచచ్చితిని.
మద — దేవీ! ముందు నీవు వీనిపై నాగ్రహింపకుము. నేను మెల్లమెల్లఁగా కృష్ణుని సమాచారమంతయు వీనిచేతఁ జెప్పించెదను. [ప్రకాశముగా] అయ్యా! వసంతకా! నీకు నోటిమీఁదికిఁ జేయివచ్చినదేమి?

వసం — [పొమ్మని చేతితో సైగచేయుచున్నాఁడు.]
మద — అయ్యో! పాపము బ్రాహ్మణుఁడా! నీకీమూగతనమెప్పుడువచ్చినది?
వసం — ఏమే! తొత్తుకూతురా! నేను మూగవాఁడనా?
మద — ఇప్పుడు కావుగాని నోరెందుకు మూసికొంటివి? ఎవ్వరు నీమూతిపైఁ దన్నినారు?
వసం — ఆ! గోపాలకృష్ణుని వెనుకచెలికాఁడనైన నన్నెవ్వఁడే మూతిపైఁదన్నువాఁడు?
మద — మఱియేమి యూలేక యీనోరుమూసికొనుట యెందుకు?
వసం — మాయయన్న గుప్తముగానుండవలసిన రహస్యమొక్కటి తెలియఁబడినపంజరములోనుండి చిలుకవలె నానోటనుండి యెగిరిపోవునని గనుక.
మద — అట్లయిన నీవిప్పుడు నోరు తెఱచియే మాట్లాడుచున్నావు గదా?
వసం — లేదు; లేదు. ఇదిగో మూసికొనుచున్నాను. [అని నోరుమూసికొనును.]

మద— ఇదుగో తెఱచితిః చూడుఁ. [అని చేతిపైఁగొట్టును.]

వసం— ఏమే! మదనికా! బ్రాహ్మణునిగొట్టుచున్నావు?

మద— ఔరా! యెక్కడిదీరహస్యము? నాచెవిలోఁ దూరి బాధించుచున్నయది.

వసం— ఏమే! మదనికా! నారహస్యము జాఱిపోయినదా యేమి?

మద— నాచెవులోఁ దూఱినదదే. దీనికేనా నీవింతసేపు నోరుమూసికొనియున్నది?

వసం— మదనికా! నీకుఁ దెలిసినదా యేమే?

మద— తెలిసి చాలసేపైనది.

వసం— నారహస్యము!

మద— నీరహస్యమే.

వసం— కృష్ణుఁడుద్యానవనమున సాత్రాజితితో మాటలాడుచున్నాఁడనురహస్యమే!

మద— ఆహా! అదియే. చచ్చినవాఁడా! నీవిందునకా యిక్కడనున్నది. [కొట్టును]
అమ్మా! రుక్మిణీ! యింక నీనిర్భాగ్యుని నీచెట్టునకు బిగించికట్టుము.

రుక్మి— దుష్టబ్రాహ్మణుఁడా! నీనైజము మానవైతివిగదా?

వసం— అమ్మా! మొదటినుండియు నాకిదియేకూడదు. ఈనాఁడు నేచేసినతప్పునకు మదనికయే నావెన్నుపాము చావఁగొట్టినది నీవింకనూరకొనుము.

మద— అమ్మా! వీనితోనేమి మనము పోదమురమ్మా. [నడచి] దేవీ! అదుగో వెన్నదొంగ

రుక్మి— మదనికా! చూచుచున్నావుగదా భర్తగారిదుర్నయము.

మద— అమ్మా! నీవీసమయమున మెత్తబడఁగూడదు.

కృ— [చూచి] ఆహా! దేవి రుక్మిణి! రాణివచ్చెనుగదా?

సాత్రా— [పాఱిపోవును]

కృ— [స్వగతము] నేనిప్పుడీమెతో నేమనిమాటాడుదును?

రుక్మి— [సహించి] కాముకా! నీప్రయత్నము నారాకవలన భంగమైనందులకు నన్ను క్షమింపుఁడు.

కృ— [తనలో] ఓహో! ఈమె కోపకార్యమును మిక్కిలి సరసముగా నుపక్రమించినది.

గీ॥ కిసుకఁజిగురాకుమోవి బి ♦ గింపలేదు
వెలఁది కనుబొమ్మలను ముడి ♦ వేయలేదు
లేతనవ్వులలీల చా ♦ లింపలేదు
పలుక నీకమానుచు నే ♦ మనివచింతు॥

అయిన నిట్లని మాచెదఁ (ప్రకాశముగా) దేవీ! నీవు మఱియొక విధముగాఁ దలంచు
చున్నావా యేమి?

రుక్మి — ప్రత్యక్షమునకుఁ దలంపులతో నేమిపని?

కృ — దేవీ! నీవేమనుకొంటివో కాని నేనుమాత్రము నిక్కముగఁ గాంతా! మణినన్వేషింప
నిక్కడికి వచ్చితిని.

రుక్మి — ఔను నిక్కముగ మీరు కాంతామణినన్వేషింప నేవచ్చితిరి. పాపమన్వేషణ
కార్యమై చేసికొన్నదియూహ నావలన జాఱిపోయినదికదా?

కృ — దేవీ! నామాటలను నీవు విపరీతార్థములు చేయుచుంటివి. నీకన్న నాయనురాగమున
కు దానలగు నన్యకాంతామణి యెవ్వతె?

రుక్మి — చాలుచాలు నీనయగారములు.

శా॥ పాపా మన్మతియు నేఁటితో, దెలిసె నీ ♦ మీమాట లెల్లను లీ
పైపై వచ్చెడి మాటలై వన్నెనయ్యెం ♦ బహుపోషణల నిర్మానసం
బే ప్రాబోధితమయ్యె రహింపఁ దలఁకె నం ♦ దేముట్టి కృష్ణా గారవి
ద్యాపాండిత్యముఁ జూపి, తేలుము తిది ♦ మానందవల్లోలినిన్

(పోఁబోవును)

కృ — (ఆపి) దేవీ! అపరాధిని నిష్కారణముగా శంకించుచున్నావు. ఇది యువతీజన
సులభమైన నైజగుణమే మాకు.

మ॥ ఇఁకముందెన్నఁడో తప్పొనర్తురని, మాం ♦ దేభర్తృన్ లోంగఁ జే
సికొనన్, గన్బొమలన్ ముడించి, కినల ♦ శ్రీకంబు మోవిన్ బిగిం
చి, కనుందోయినిఁ గెంపు గించి, పలుకిన్ ♦ చేసేత నిష్కారణ
ప్రకటక్రోధముఁ జూపుటంగనలకున్ ♦ స్వాభావికంబే కదా॥

(చెలికత్తెతో) మదనికా! నీవైన నావిషయమై దేవిగారితోఁ జెప్పవే.

మద — చెప్పవలసినదేదియో యిదివరకే చెప్పియున్నాను.

రుక్మి — గోపాలా! నీమదన సామ్రాజ్యమంత్రియగు వసంతకుఁడే నీయవినయవృత్తాంత
మంతయును నాకుఁ జెప్పినాఁడు.

కృ — దేవీ! కల్లలకుఁ బుట్టినిల్లగు వసంతకునిమాటలనమ్మి యూరక నీవు నన్నింతకోపగించు
చున్నావు. అయినను వసంతకుఁడేమి చెప్పెనో నన్నడుగనిమ్ము. వసంతకా! నాపై
నేనియపరాధమేల మోపితివి?

వసం—అయ్యోరామా! నేను నీవుచెప్పినట్లు నోరుమూసికొనియే కూర్చున్నానయ్యా! యీతొత్తుకూతురు మదనికయే నాచేతయేమో ప్రేలించినది.

మద—నే నేమిప్రేలించితివి?

వసం—ఏమో నాకు జ్ఞాపకము లేదు.

రుక్మి—ఓ బ్రాహ్మణుఁడా! కృష్ణుఁడెక్కడనున్న సంగతి నీవెఱుఁగవేమి?

వసం—నే నెఱుఁగను.

మద—పోనీ నిన్న నీవెఱుఁగుదువా?

వసం—ఏమో నే నెఱుఁగను.

మద—నీ విప్పుడెక్కడ నెందుచున్నావు

వసం—ఏమో నాకుఁ దెలియదు.

మద—దేవీ! యీబ్రాహ్మణుఁడు నట్టిట్లీఁడుగాని వీనిమొదట శిక్షింపుము.

వసం—అమ్మా! రుక్మిణీ! చేయవలసినశిక్ష యిదివరకే మదనిక చేసినదిగదా?

కృ—(స్వగతము) ఈబ్రాహ్మణుఁడు తెలివితక్కువచే నేదియో కూసియే యుండును. మదనిక మొదటినుండియు నాపై దేవికి చెప్పుచునే యుండునుగదా! అదియుండఁగాక,

గీ॥ మగలఁ దవడిపై నను ♦ మానపడుదు
రాఁడువారు రక్తే తమ ♦ తోడిసకియ
లున్నయెడలే వియ్యంబున్న ♦ యూఁదుచున్న
జెప్పవలసిన దేమింక ♦ జెలులయలుక॥

రుక్మి—మదనికా! ఈలాగునఁ బరాభవింపఁబడియు నింకను నేనీధూర్తగోపాలునికడ నేల నిలువవలయును? పోదము రావే [అని పోవుచుండ]

కృ—(చేయిఁబట్టుకొని) దేవీ! నేనింతచెప్పుకొన్నను నీవు నన్నపరాధియనియే తలంచుచున్నావుగదా? ఆలాగైన నన్నేక్రియమున శిక్షింపవలయునో యాక్రియమున శిక్షించి ద్దుఃఖమ్ము మాఁడు,

మ॥ కనుబొమ్మల్ ముడిపెట్టుచు మోహానకటా ♦ కుటిలందగ్గించి యొ
య్యారం గమోమ్ముత్రిప్పించి, లోనదరహా ♦ సాంకూరముఁ గప్పించి కో
పన! పైపై బెదరింపనేల నను నీ ♦ బాహామృణాళంబులన్
[illegible]

[పిమ్మట మాయాకృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు]

వసం — ఓరీ నిర్భాగ్యుఁడా! శతఘ్నుఁడా! కృష్ణవేషము వేసినప్పుడు నీమొగానికెంత తెలివివచ్చెఁదిరా? కాని నీకర్మమేమిబాగున్నదికాదు ఇక్కడిసత్యభామ ముక్కిడిమానిసుల దిను రక్కసిముండ నిన్నుగూడ విఱిచికొని తినును లే పద.

మాకృ — ఆహా! (తనలో) కన్యాలలామయగు సత్యభామకై నేనెన్నిపాట్లుపడవలసి వచ్చినది. ఏదియైనను,

ఉ. అక్షయకాయసిద్ధిఁ గడ ♦ యంగ మునీశ్వరులు పెద్దకాలము
ప్రాక్షిరియున్ పడక్షిరియు ♦ ధ్యానముఁ జేసి కృశింతురేను స
త్యాక్షరయుగ్మమంత్రమున ♦ నందితి నత్తమకాయసిద్ధి స
ద్వీక్షణపాత్రమైన ప్రభ ♦ విష్ణు కృష్ణునిరూపమూనుటన్.

మఱియుఁ గామాతురుండనైనను నేనిప్పుడనన్యసామాన్యమయినగౌరవభాగ్యమునే పొందియున్నాను. ఎట్లన,

మ. అరయన్ గానఁ బెద్దకాలము వినా ♦ శాహారులై యన్యమున్
బొభాషింపక సత్యపోనియుతులై ♦ వర్తించు నిష్ఠాగ్నులై
ఋషిశ్రేష్ఠులెందరో యుగాలో ♦ కృష్ణస్వామిసాయుజ్యమున్
దగఁజేకొంతనఁ దలఁచిన్ క్షణములో ♦ నన్ నేనుగాధన్యుఁడన్.

భగవాఁడైన కృష్ణుని మహాత్వం జేజించిన వాఁడనయ్యు నీసత్యపై మోహావేశముచే నాతని నేవంచింపఁదలంచితి కాని నీభ్రాంతియెంతెంత యకార్యంబులఁ జేయింపదు?

కాని, యీనారూపమును జూచి నేనెంతయు గర్వపడవచ్చు నెందుచేతననఁగా

గీ. ఏ జగములేలు నింద్రుఁడు ♦ మున్నహల్య
వలఁచి నీచపుఁగోడియై ♦ మొఁగునేను
సత్యకై కృష్ణమూర్తినై ♦ సంచరింతు
నేనె మిక్కిలిమాన్యుఁడ ♦ నింద్రుకంటె.

నేనింక సాత్రాజితి యొద్దకుఁబోయి తత్పాణిగ్రహణమహోత్సవమనుభవించెద. (నడుచుచు నెడమకన్నదరుట సూచించి) ఏమిది ప్రియురాలైన సాత్రాజితిని సమీపించుచుండ నపశకునముగా వామనేత్రస్పందమగుచున్నయది. నాకృష్ణరూపము యథార్థముగానున్నదిగదా (మాచికొని) ఇంక నీయపశకునములు నన్నేమిచేయఁగలవు. అదిగో నాభాగ్యలక్ష్మియగు సాత్రాజితి తనచెలికత్తియ

యగు మంజువాణితో నేమో మేలమాడుచున్నది. సమయముం జూచి యామె సరసకేగెదను.

వసం— (తనలో) ఇప్పుడు వీనితోఁ గొంతపరిహాసము చేసెదను. (మనిమాగా కృష్ణుని సమీపించి) కృష్ణా! ఇదిగో నీమదనసామ్రాజ్యలక్ష్మియగు సాత్రాజితి తొందరగా సమీపింపును.

మాకృ— (తనలో) ఈవిజ్ఞబ్రాహ్మణుఁడు నన్ను గృష్ణుఁడనియే తలంచినాఁడు. వీనితో మిక్కిలిజాగరూకతతో మెలంగవలయు. వీఁడు నాకడనుండుటయు నొకమేలే. అందువలన సందియమేమియు లేక యాసాత్రాజితి నన్ను గృష్ణునిగాఁ దలంచును. (ప్రకాశముగా) మిత్రమా! వసంతకా! నీవు నాయొద్దనే యుండి యీమదనతంత్రమంత జూచుచుండుము.

వంస— నటుపుము నేయున్నాను. యింకనున నపఁగలను.

మాస— మంజువాణీ! నీచేతిలోనిదేమిటే?

మంజు— అది జాజిపూబంతి కొంతసేపు నీతో బంతులాడవలయునని నాకు ముచ్చటగానున్నదే.

మాస— నీముచ్చటను నేనేల భంగము చేయవలయును కానిమ్ము.

(ఇరువురు బంతులాడుచుందురు)

మాకృ— ఆహా? మిత్రమా! కందుకకేళీలోలయైన యీబాలామణి, తనరూపలీలావిభ్రమముల నామనంబును మఱింత నాకర్షించుచున్నది చూడుము,

సీ. మంచుమబ్బున్నెను లావ ♦ రింగు తామరపోలె
జెమటచే మోమొప్ప ♦ చెన్నుఁదాల్ప
వలలోని జక్కవ ♦ పులుఁగుజంట విధాన
జనుదోయి పైట సం ♦ దున నటింప
అలరువిల్తునిదాడి ♦ కలరు వాద్యములట్లు
కంకణార్భుణార్భుణ ♦ త్కారమొసఁగ
కలువరేకులపూఁగు ♦ నళిపోతములరీతిఁ లాడ
గండోయుపుంగురుల్ ♦ సిందు
గీ. కేలుగంటూడి పిఱుదుల ♦ వ్రేలుకురుల
వేగనొక కేలువెడఁబాడి ♦ వేసికొనుచు
అలపుటూర్పులతో బంతు ♦ లాడుచున్న
బోటి పాటిమాటిముద్దుల ♦ మూటగట్టు.

వసం—మిత్రమా! నీకొఱకే బ్రహ్మాదీనినింత చక్కఁగా సృజించినాఁడు మనకు బైటఁబడుటకిదియే సమయము

మా కృ—రమ్ము పోదము [మాయాసత్యభామను సమీపించుచుండఁ బూబంతి తనపైఁ బడును] హా! కామినీమణీ! యెంతదయమాలినపని చేసితివి

చ॥ అసురసురారి తిప్పటికె ♦ యంగజుకోల్తొ కోలతాంగి! సా
హసమున నీవు వానికిన ♦ హాయముగాఁ బరిచెంద నాపయిన్
విసరితివే ధరించుటకు ♦ నేనలభీష్ముఁడనో త్రిశూలినో
యసితసరోరుహాక్షి! కను ♦ మా నను నీకడఁ గంటిచుంపుమున్

మా స—మంజువాణీ! యెంతపని జరిగినదే! గోపాలకృష్ణా! నాయవినయంబునకు నన్ను క్షమింపవలయును.

మా కృ—బాలా! క్షమించుటకు నీవుచేసిన తప్పేమున్నది! చూడు,

శా॥ ఏలాజంకెద? నేనునీకతిథినై ♦ యేతెంచితిన్ గావునన్
బూలంబూజయొనర్చి నిప్పితివిన ♦ న్నన్ గాన వక్షోజపా
ళీలావణ్యరసంబులంజిలికి క ♦ లీ!తానమాడింపు మే
మోలే నీయధరామృతంబున కెస ♦ మ్మోదించి నేపోయెదన్

వసం—ఈమందభాగ్యుఁడేమి యున్మీలిత్యారుచున్నాఁడు పాపము వీనియవస్థఁ జూచిన నాకు నొకమూలనుండి నవ్వును నొకమూలనుండి జాలియుఁ గలుగుచున్నది.

మా స—మంజువాణీ? మనకుఁ బొద్దయినది పోదము రావే. [వెళ్ళుచుండ]

వసం.—చెలికాఁడా! పోనీకుము.

మా కృ—అళిచికురా! యేమియింత యనాదరణము?

శా॥ ఏమాటాడక చూచిచూడనటులీ ♦ విట్లేఁగుచున్నావిదే
మే? మేవర్ధులమా మునీకడకుని ♦ ల్లీతేర మన్యాగగా
సేమంబారయవా? పథశ్రమాభవ ♦ త్స్వేదంబుఁజల్లార్పవా?
మోమోమాటంబున్ గామితంబెటిఁగిన ♦ మ్మోదంబునన్ జేల్పవా?

వసం—ఓబాలా! సత్యాహ్మణుఁడనయిన నేనుగూడ నోరుచేసికొని చెప్పుచున్నాను నీవనికోరివచ్చిన యీకృష్ణునకు నీశక్తికి మించకుండ నేదోమర్యాదఁజేసి పంపుటమంచిది. పిదప నీయిష్టము.

మా స—గోపాలా! మీవంటియర్థుల కామితంబు లెటింగితీర్పుటకు నేనేపాటి సమ
ర్థురాలను?

మా కృ—సాత్రాజితీ! ఏమట్లు దీనోక్తులు పలుకుచున్నావు? అనన్యకన్యాసామా
న్యమైనలావణ్యభాగ్యంబునందులతూఁగు నీవేమాకోరికలు దీర్పకున్నమాకుమఱెవ్వ
రుదిక్కు? చూడుము,

మ॥ అలకాధీశునిపెన్నిధానములలో ♦ నబ్జాననుం డేర్చి కుం
తలనీలంబుల నేత్రపద్మముల దం ♦ తశ్రేణి కుందమ్ములన్
గళశంఖమ్మునఁ బాదకచ్ఛపములన్ ♦ గైసేసి మీవంటి యు
ర్థులంబోల్పంగలదానిఁ జేసెదన ♦ నేర్పుం జూపి నీరూపమున్

మా స—పల్లవీపల్లవా! నిన్నుఁబోలఁగల కాంతానిధానంబులు వేనవేలున్నవి.

వసం—ఎందఱున్న నేమి? నీవంటిదొక్కతెయు నీతని కింతదనుక లభింపలేదు.

మా స—ఆర్యా! నేనుమాత్ర మెంతపాటిచక్కనిదానను?

మా కృ—బాలా! ఆలాగనకు,

గీ॥ అల మహేశుననంతము ♦ హ్రస్వమట్లు
మెలఁత! చక్కఁదనమున ♦ మితియు ధాత
యారయ లేఁడయ్యెఁగాన నే ♦ మాటలనిన్ను
బోల్చి నెంతస్తుతియింపఁ ♦ జాలఁడయ్యె

మా స—ఆర్యా! మీకీయసత్యప్రశంసయేటికి? యేకాంతముననున్న పరకాంతా
జనమును మీరింత చనవునఁ జులుకనఁజేసి మాటాడుచున్నారు. ఇదిమా గౌరవం
బున కెంతయుఁ దగని ప్రవర్తనము గదా.

మా కృ—ప్రియసఖీ! నీవు నాకుఁ జిరపరిచితురాలవేకాని పరకాంత వెట్లవుదువు?
చూడు,

చం॥ నిలిచినఁ గూరుచుండినను ♦ నిద్దురవోయినఁ గల్వరించినన్
బలికినఁ వ్రాసినన్ మనము ♦ నన్ సతమేయువతిన్ దలంచి ని
శ్చలపులకాంకురప్రకట ♦ సాత్త్వికచేష్టలతో రమింతునో
యలచెలి వామనోహరివి ♦ యాహృదయేశ్వరివీవు లాతివే?

కావున నాకెంతయు స్వతంత్రురాలవే.

వసం — కామినీ! యింతనమ్మకముగాఁ జెప్పుచున్నప్పుడు నీవీతనినవశ్యము చేపట్టవలసినదే.

మంజు — భర్తృదారికా! నిజమేనమ్మా! ఈతఁడునీకు వరుఁడే కుఁడే

మా స — మంజువాణీ! నిన్నెవ్వరిచ్చుట రాయబారములు నడుపమనలేదుగాని యూరకొమ్ము.

మా కృ — ప్రేయసీ! నిష్కారణముగా మంజువాణిపై నేలకోపగించెదు? దాని రాయబారములతో నేమిపని? చూడు,

చం॥ తడవులనుండి మన్మథుఁడె ♦ తానయితేటికి రాయబారముల్
కడకిటువన్న నీమనము ♦ ఖండనకంపెడుగాన, నాకునై
నడిచితి లోనకోరిక,న ♦ నర్మమతిన్ దరియించి టెంకిగన్
గడగిన మధ్యవర్తియగు ♦ కామునిఁ జుల్కనఁ జేసినట్లుగన్

వసం — ఓకాంతా! మన్మథునితోఁబాటు నేనుగూడ మీకిరువురకు మధ్యవర్తినే నామాట నీవుబొత్తుగాఁ దీసివేయరాదు.

మాస — గోపాలా! నేనుకామునిఁ జుల్కచేయుటకాదు కాని నీవునామూలమున నీభార్యలందఱిచేఁ జుల్కనయి పోదువు.

మాకృ — నీవిట్లనుటచే నేనుమఱింత చుల్కనగుచున్నాను

మాస — ఎవరిచేత?

మా కృ గీ॥ తరుణి! నీచేయునీయునా ♦ దరము చేత
ముక్కునకోపరసముంచి ♦ ధిక్కరించు
చెఱకువిలుకాని ప్రోదిరా ♦ చిల్క చేత
నలుకఁగన్నెఱ్ఱసేయుకో ♦ యిలల చేత

మంజు — ప్రాణసఖీ! ఇంతగా బతిమాలుచున్న యీగోపాలదేవుని నీవు నిరాకరించుట మిక్కిలి విరసముగానున్నదే

మాస — చాలులే నీవు మహాసరసురాలివి దొరికినావు.

మంజు — పోనీ నాకెందుకే నీగొడవ నీవేమైనఁ జేసికొమ్మ నేఁబోయెదను

[నిష్క్రమించును]

వసం — మిత్రమా! నేనుగూడ నిక్కడనున్నచో సిగ్గుచే నీవు బతిమాలినకొలంది నిలువ

యుండిన కటికబియ్యపు రొట్టెవలె నీబిస బిగిసికొనిపోవుచుగాని నేఁబోయిన నీవుమాత్రి మీమెనెల్లైనఁ దక్కించుకొనుము. వేసారకుము. ఏమన,

ఆ వె॥ కాముకునకు నేమి ♦ గర్భాతురున కేమి
విసుగుసిగ్గునున్నఁ ♦ బొసఁగదెందు
కార్యమైనదాకఁ ♦ గాంతచే దాతచేఁ
దిట్టులెన్నియేనిఁ ♦ దినవలయును

(వెళ్ళును)వీరొండొరుల నిక్కవంపు రూపములు కనుగొనుదాక నేనిక్కడనుంటినా యారక్కసిముండకొడుకు నన్ను గుటుక్కున మ్రింగివేయును కావున నేఁబోయి మాకృష్ణునకు వీరివార్త యెఱింగించెదను. (నిష్క్రమించును)

మాస—మంజువాణీ! పోకుము నేనును వచ్చుచున్నాను.

మాకృ—(చేయిఁబట్టుకొని) ఓసి కఠినురాలా!

చం॥ సరసతచేతఁ గందనుక ♦ సాగితి మేలిమిలేకపోయె నిం
కిరమరమాని నీనుమధు ♦ రాధరసారసుధారసంబులన్
స్మరశరతాపదాహమును ♦ మానిచితేల్చినదాక నేనునీ
చరణసరోజముల్ విడువ ♦ చాలరో! మన్మథునానతప్పినన్

(కాళ్ళపైఁబడును)

మాస—(తనలో) ఈకృష్ణుని గాటమైనవ్యామోహమున ముంచి నామాయాజాలమునఁ బడవైచితివి. వీనియొద్దనుండి శ్యమంతకము సంగ్రహించుటకిదియే తగినసమయము. మాయలమారియైనశంబరాసురుం డెంతపుఁజాలఁడు. (ప్రకాశముగా)గోపాలకృష్ణా! అస్వతంత్రురాలనయిన నన్ను నీవింత మోమోటపెట్టిన నేనేమిచేయఁగలను?

మాకృ—నీ వస్వతంత్రురాల వెట్లయితివి?

మాస—మాతండ్రి సమ్మతి నాకు లేదుగనుక

మాకృ—నాకొఱకయి మీతండ్రి యన్యథాయోజింపఁడే

మాస—శ్యమంతకంబిచ్చిన యెడల

మాకృ—శ్యమంతకంబిచ్చిరయే తీరవలయునా?

మాస—నీవునన్ను వివాహమాడియే తీరవలయునా?

మాకృ—అవును.

మాస—అలాగైన నిచ్చియే తీరవలయును.

మాకృ—[తనలో] నేను గోపాలకృష్ణుని రూపమునవచ్చినను నీసాత్రాజితి నన్నింకను శ్యామంతకమపేక్షించి యుపేక్షించుచున్నదే. ఇప్పుడేమి చేయను యిట్లని చూచెద, (ప్రకాశముగా)

గీ. చెలువ! గాంధర్వవిధినిన్ను ♦ బెండ్లి యాడి
మొదట నాకోర్కెఁ దీర్చుమా ♦ పిదప మణిని
నెచటనుండిన నేగిన ♦ యించి తెచ్చి
యింతి! నిన్ను బరిగ్రహింతు ♦ యింతు నిజము.

మాస—అదియే పాకిరాదు.

మాకృ—(కోపముతో) ఛీ! ఛీ! బ్రతిమాలుచున్న కొలఁది నీవు మతింత యవినయము చూపుచున్నావు. ఇప్పుడు నీకడ్డము వచ్చువారెవరో చూతెము. నిన్నీశతధన్వుఁడు (ఉపవారించి) ఈకృష్ణుఁడు దక్కించుకొనక మానఁడు. (అని పట్టుకొనును.)

మాస—ఏమిది! శతధన్వుఁడనుచున్నాఁడు. వీఁడు శతధన్వుఁడాయేమి? (ప్రకాశముగా) ధూర్తుఁడా! మణిమాట యటుంచి తొలుత నీవెవఁడవో చెప్పుము?

మాకృ—[తనలో] ప్రమాదవశమున నోరుజారి నా పేరు చెప్పనే చెప్పితినే. ఇప్పుడింకను నావిచారమేల [ప్రకాశముగా] ఓసాత్రాజితీ! నేనెవ్వఁడైన నీకేమి నిన్ను మాత్రము నేను విడువను.

మాస—అటు గాదు. నీవు కృష్ణుఁడవేయైనచో నేను నిన్ను వివాహమాడను.

మాకృ—ఎందుచేత?

మాస—నాకాతనిపై ననురాగము లేదు.

మాకృ—ఆలాగయిన కృష్ణుఁడను నేనుగాను మఱియెవ్వరిని వివాహమాడుదువు?

మాస—నాకు శతధన్వునిపై ననురాగము మెండు.

మాకృ—[తనలో] తొత్తుకూఁతురు కళావతి యీసాత్రాజితికిఁ గృష్ణునిపైననురాగము కలదని యబద్ధములు చెప్పినదేటికో? ఇప్పుడు నాపేరు చెప్పినయెడల నీమె నన్ను జేపట్టక పోవునా? ఓసాత్రాజితీ! నేను నీకు నిజము చెప్పనా?

మాస—చెప్పుము.

మాకృ—నేను నిజముగా కృష్ణుఁడను కాను.

మాస—మరియెవ్వఁడవు.

మాకృ—నీకెవ్వనిపై ననురాగముగలదో యట్టి శతధన్వుఁడను యింక నన్నాదరింపుము.

మాస — అలాగయిన నేను సత్యభామనుకానే.

మాకృ — మఱియెవ్వతవు ?

మాస — మరియెవ్వఁడవనుము.

మాకృ — త్వరగా చెప్పుము. ఎవ్వఁడవు?

మాస — నీప్రియమిత్రుఁడను శంబరాసురుఁడను.

మాకృ — అయ్యో! యీ తమోసము వాటిల్లినది. మిత్రమా! శంబరా! నీవీసత్యభామారూపమున నెప్పుడీ క్రేవకు వచ్చితివి.

మాస — నేనెప్పుడువచ్చిన నేమిగాని నీవింతవఱ సత్యభామతో మాటాడితివా ?

శత — నీతోడనే మాటాడితిని.

శంబ — అయ్యో! మనము త్రెవ్విన పల్లమున మనమే పడితిమి. ఇది నిక్కముగాఁ గళావతిచేసిన పొరపాటు.

శత — కళావతి యేమిచేయును యీ తమ నాయదృష్టమీపాటిగానున్నది. ఇంకను మనకీ పగటివేషములెందుకు? నీమాయవిద్య నుపసంహరింపుము.

శంబ — (అట్లు చేసి) అదె వచ్చునది కళావతికాఁబోలు.

కళా — (ప్రవేశించి) నేనుచేసిన సహాయమునకు మాశతధన్వుఁడేమి బహుమతి చేయునో అనుగో శంబరునితోఁగూడ నిక్కడనే యున్నాఁడు [సమీపించి] అయ్యా శతధన్వుఁడా! నీవిషయమై నేనెంత శ్రద్ధతోఁ బనిచేసితిని సత్యభామను నీ యొడిలో నుంచితిఁగదా ? మఱి నాకానుకమాట చెప్పుము.

శత — ఓసి! రాలగాయా! యేడ్చువానిని మఱింతయేడ్పించుచున్నావు. నీవు నా మొగమున పెద్దబండఁ గొట్టితివి.

కళా — ఏమయ్యా! అట్లనుచున్నావు?

శత — ఇదివరకయిన నవ్వుబాట్లు చాలుదురమ్మ. కృష్ణుఁడెక్కడనున్నాఁడు?

కళా — ఇప్పుడే శ్యమంతకాన్వేషణమునకయి బయలుదేరి పోవుచున్నాఁడట.

శంబ — అట్లయిన మఱియొక యాలోచనము చెప్పెదరమ్మ.

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది ద్వితీయాంకము.

---



# సాత్రాజితీయము



## తృతీయాంకము.

### రంగము—అరణ్యము.

(అంతటఁ గృష్ణుఁడు ప్రవేశించుచున్నాఁడు.)

చ. నిలయములున్ బురంబులవ ♦ సీధరదుర్గములున్ నికుంజముల్
కొలఁకులు పక్కణంబులును ♦ గాఢపుఁ దొక్కలిగాండ్రగూడెముల్
గలయఁ జరించి వేసరితి ♦ గాని మణిన్ గననైతి రిత్తచే
తలఁచి టుపోయి యేమొగముతోఁ ♦ బ్రియురాలినిఁ బల్కరించెదన్.

మఱియు

చ. ఎదియెటులైన వచ్చెద సు ♦ మీ నెలకే యని చేతగాని వ
ట్టిదొరతనంపునీటు బ్రిక ♦ టించితి నెచ్చెలియొద్ద నేఁటికొ
క్కదినము మాత్రమే కొఱఁత ♦ గాగిదు వేగను యెంత వత్తినో
గద మఱి రెండుమాసముల ♦ కాలము నీనయితిన్ నెలంతకున్.

అయ్యో! ఆకామిని నామీఁదఁగల ప్రేమాధిక్యముచేఁ దన్నుమఱతునేమో యనికదా యీముక్తాహారమును నాకొసంగినది. అట్టి నాప్రాణసఖికి నేనెంత యాశాభంగము గలిగింపఁ బలసివచ్చె. (ముక్తాహారమునుజూచి)

క. ముక్తాహారమ ! నాకై
ముక్తాహారముగఁ బూవు ♦ బోఁడికృశించున్
నక్తంచరాదిఖలులుఁ కు
యుక్తిం జెలినేమిజేసి ♦ రోయీయాలోనన్.

గీ. కాంత! సత్యామణీమాలి ♦ కా! దురంత
పాతకుఁడ నిన్నుఁ జెఱికెద ♦ బాసినాఁడ
దగ్గఱనెయున్న సకిమే ♦ తాపమందు
గొంతవఱ కేఁయుం బఁచు ♦ కొందువుగద.

ప్రసేనునిజాడ నీయరణ్యమునంతయు నన్వేషించియే పురంబునకు మఱలెదను. వెటవచ్చిన పరిజనమెంతదూరమున నున్నయదియో? (అని నడిచిచూచి) ఎవ్వని దీ శవము! పోల్పనైనను వీలులేకుండ కరచరణంబులు నక్కలచే నూడఁబెఱుకంబడినవి ఏమిది! యిచ్చట హేమకంకణము లగపడుచున్నవి ఇవి తప్పక ప్రసేనునివే. అహో! ఇదియేమి చేరువ నొకసింహశవంబు గానుపించుచున్నది. యీ సింహమే ప్రసేనుని వధించియుండునా? అలాగైన నీసింహమును వధించిన బలశాలియెవ్వఁడో? ఎట్టయెదుటఁ గనుదీర్ఘమయిన కొండచఱియయొండు నేత్రగోచరమగుచున్నయది. ఆహా! యీపర్వతరాజ మెంతమనోహరముగానున్నది.

గీ. చఱులవెంబడి దొనదొనన్ ♦ జారుచున్న
నన్నె సెలయేటితో నొప్పు ♦ శైలరాజు
కరముపై బడి మదవారి ♦ గురియుచున్న
చండవేదండవిభుతో ♦ సాటియగును.

మరియు

క. ప్రవిమలగైరిక ధాతు
చ్ఛవిచేతఁజిరన్నరన్న ♦ సానుతతుల నీ
యవనీధరము రహించెన్
మివులన్ హరిచాపయుక్త ♦ మేఘము వోలెన్.

వెండియు నీకొండనెత్తముల యందందుఁ గాలిబడకలగపడుచున్నవి. యిందొక్కదాని దరిఁ జూచెదను. ఓహో! యిదియొక గుహగాఁబోలును ఇక్కందరం బాటవికచోరుల కునికిపట్టైయుండునా? (ప్రవేశింపఁబోయి) గాఢాంధకారబంధురంబై యిక్కందరంబు కరవగాహముగానున్నదే!

గీ. ఖలజనుని చిత్తమున్బోలి ♦ ఘనతమఃప్ర
పూర్ణమై రాత్రిచరవార ♦ ములకువసతి

యుగుచు లంకాపురంబునఁ ♦ దగినయట్టి
కందరం బేరికిం జెన ♦ కందరంబు॥

(మెల్లఁగా నడుచుచు) నడిచినకొలంది వెలుతురుగానవచ్చుచున్నయది ఆహా! యిదియొక దివ్యభవనమువలె నున్నయది ఈకుహరంబున నెవ్వఁడో భాగ్యశాలి కాపురముండనోపు ఇదిగో నిచ్చట మణిడోలిక వ్రేలాడుచున్నది. ఆహా! యిదియే శ్యమంతకమాణిక్యము (పరిగ్రహించి) ధన్యోస్మి యెవరిది యీవంకకుఁ బరువెత్తుకొని వచ్చుచున్నయది.

(ప్రవేశము దాసి) ఎవరయా నీవు ఇచ్చటిమణియేది? నీవు దొంగవలెనున్నావే. అయ్యో జాంబవంతా! (అని పరుగెత్తును)

కృ—(తనలో) ఈగుహ జాంబవంతునిదా!

[పిమ్మట జాంబవంతుఁడు కోపముతోఁ బ్రవేశించును.]

మ॥ తులువా! యెవ్వఁడ వీవు వేల్పులకు నేఁ ♦ దుస్సాధ్యమై యట్టినా
బిలముం జేరి హరించినాఁడవు మణిన్ ♦ వీరుండ వేమైనచో
నిలుమీ యింతటఁ బాఱిపోక భయకృ ♦ న్నిర్ఘాతపాతంబుతో
దులదూఁగంగల నాదుముష్టిహతిచే ♦ దూలింతు నీప్రాణముల్

కృ— భల్లూకేశ్వరా!

గీ॥ అడచిపడకుము నీ యట్టి ♦ యనదచేతఁ
బడుటకితఁడంత పాటిదు ♦ ర్బలుఁడు గాఁడు
పరధనంబు హరించిన ♦ పాపకర్మ!
నిలుము నీప్రాణధనముల ♦ నేహరింతు

జాంబ— మాతో నిర్భయముగా మాటాడుచున్నాఁడవు నీవెవఁడవురా? పరధనమా పరధనమేమి! స్వధనమేమి?

మ॥ ధనరాజ్యంబులు బాహువిక్రమబలా ♦ ధారంబులై యుండనో
క్కనిసొంతంబె స్థిరంబె వసుంధరవని సం ♦ గ్రామంబునం భద్రమౌ
వ్వనిదో వానిది నీవి నావనెడు మ ♦ ద్భ్రాంతిం బడం బోకుమీ
యనిలో నన్ను జయించితేని మణి నీ ♦ దౌరయ్యుఁ దేనైనచోన్.

కృ—ఏమిరా! చోరశిఖామణీ! నీచోరశాస్త్రపాండిత్యమంతయు నీకృష్ణునియొద్ద వెల్లడించుచుంటివి.

జాంబ—ఓహో! కృష్ణుఁడననీవేనా! అందులకేనను చోరశిఖామణియని దూషించితివి కాని,

కం॥ ఏదీ వ్రేపల్లెకరా
పోదము వనరిత్తవాద ♦ ములతో నేమీ?
నాదొంగతన మదేదో
నీచోరతన మేదో యుచట ♦ నిర్ణయమగుతఱిన్

ఉ॥ గోపసతీమనోధనము ♦ గొల్లగఁగొట్టితినో? తదీయపుం
గొవ్వురముల్ హరించితినొ ♦ కమ్మని వెన్నలజూరలాడి? యే
దీ పరికించి తెల్పుమొక ♦ టేనియు నామెడఁగాని చొప్పవా
యోపినయట్టులాడిన జ ♦ నౌఘము మెచ్చునె? నమ్మవచ్చునే?

కృ—భల్లూకపతీ! చాలునీవాచాలత్వము అవక్రింబులగు మాలీలావిక్రమంబులు మృగప్రాయుఁడవైన నీవేమెఱుంగుదువు.

జాంబ—నేనెంత మృగప్రాయుఁడనయినను నీవిక్రమంబుల నెఱుంగకపోలేను. వినుము.

సీ॥ అడలుచుండఁగఁబట్టి ♦ యాతుదానివధించి
ప్రబలినాఁడవుగదా ♦ బాహుశక్తి
చదపుర్వుచేఁబుచ్చు ♦ శకటమున్ విదళించి
వివరించితివిగదా ♦ విక్రమంబు
చిఱుతమీలనుమ్రింగు ♦ చీకుఁగొంగనుజంపి
చాటినాఁడవుగదా ♦ శౌర్యపటిమ
కసవుమెసవుఁట్టి ♦ ముసలియెద్దునుజంపి
మెసఁగినాఁడవుగదా ♦ లసితకీర్తిన్

గీ॥ గొల్లముల్లాండ్రయిండ్లలోఁ ♦ గొల్లఁగాను
బాలు పెరువుము ద్రావిత ♦ ద్భాండములను
బగులఁగొట్టినసద్భుజా ♦ బలుఁడవీవు
నిన్నెఱుంగకపోలేను ♦ వెన్నదొంగ!

కృ—ఓరీ పరనిందాఫరాయణా!

కం॥ చీమలదోమలఁ బీల్చెడు
నీమగటిమిమాత్రమేమి ♦ నెగడిన దోరీ
వేమాటలేల? పద రణ
భూమికి నదె నిర్ణయింతుఁ ♦ బో మనబలముల్.

జాంబ—ఓరీకుట్టా! మాటిమాటికి యుద్ధము యుద్ధమని మాటిమిమున్నావు. యుద్ధ మన నేమని నీతలంపు?

సీ॥ గొల్లయిల్లాండ్రతో ♦ సల్లాపములుగావు
సమరక్రియాప్రసం ♦ గములుగాని
తరుణాంగుళీన్యాస ♦ మురళీరవముగాదు
సమదోగ్రసింహనా ♦ దములుగాని
చెలువుఁ జెక్కిళ్లపై ♦ నెలవంక లిపిగావు
తనువుసించెడు బాణ ♦ తతులుగాని
మెసవఁగాఁగిడుపాల ♦ మిసిమిముద్దలుగావు
నిష్ఠురంబగుముష్టి ♦ నిహతిగాని

గీ॥ కోమరుటావుల యంభార ♦ వములుగావు
సమద మాతంగబృంహిత ♦ చ్ఛటలుగాని
బాలికాపాళికాజల ♦ కేళిగాదు
వాలుగండ్రండ్రతో రణ ♦ కేళిగాని

కృ—ఓవృద్ధభల్లూకమా!

ఆ॥ అవయవంబులెల్ల ♦ నవసి నెమ్మేనిలో
సంధిబంధములును ♦ సడలిపోయి
వయసు నచ్చెగాని ♦ వాజ్మాత్రశౌర్యమ్ము
చావదింక మెచ్చఁ ♦ జమునినున్న॥

జాంబ—కుట్టా! యేమన్నావు? వాదివాజ్మాత్రశౌర్యమా! భుజశౌర్యము కాదేమి?

శా॥ ముష్టాముష్టిగ నీవునేనుగుటిగాఁ ♦ బోరాడుచో విక్రమా
వష్టంభంబునఁ బట్టినీదుచరణ ♦ ద్వంద్వంబు చక్రక్రియన్

బుష్టిన్ గిఱ్ఱునఁ ద్రిప్పి రాతను శిరం ♦ బున్ గొట్టుచో నీకు వి
స్పష్టంబౌ భుజశౌర్యమో మఱి వచ ♦ శ్శౌర్యంబో నాదారయన్ ॥

క్రు — జాంబవంతా! అప్పుడు నీ భుజశౌర్యమును లోకులు మెచ్చకపోరు

జాంబ — మూర్ఖా! ఒకరు మెచ్చవలసిన పనియేమున్నది?

శా॥ రక్షస్సైన్యముఁ జొచ్చి మున్ను భుజద ♦ ర్పంబేర్పడన్ గాళ్లతో
విక్షేపించుచుఁ జేతులన్ జరచుచున్ ♦ వీరావళిన్ దున్ముచో
సాక్షాద్విష్ణుఁడు రాముఁడే యను భళీ! ♦ శాబాసనన్ నీవున
న్నాక్షేపించిన నేమి? మెచ్చిననునే ♦ మా? వల్లవీపల్లవా!

క్రు — ఆక్షేపింపుటకుఁగాని మెచ్చుటకుగాని యిప్పుడెట్లు వీలగును సంగర రంగంబున మనయిరువుర భుజబలంబుల తారతమ్యంబులఁ బరిశీలించినప్పుడుగదా?

జాంబ — అట్లయిన నిప్పుడే యుద్ధభూమికి నడువుము. (అని చేయిఁబట్టి లాగికొనిపోవును)

(పిమ్మట మందపాలుఁడు ప్రవేశించును)

అక్కటా! యిల్లు వెడలినప్పుడు తప్ప కృష్ణుని జాడయే నేఁ జూడనైతి. యీగుహలో నుండి కృష్ణుని కంఠస్వరము మాత్రము వినఁబడుచున్నదిగాని పోయి చూచెదనన్న నావంటి వాఁడొంటిగాఁ బోవఁదగినది కాదు. ఈసమాచారము పురంబులోని పెద్దలకెఱింగింతును. (అని నిష్క్రమించును)

(పిమ్మట కృష్ణజాంబవంతులు ప్రవేశింతురు)

జాంబ — కృష్ణా! ఇంక యుద్ధప్రక్రియ చాలును,

శా॥ విద్వేషంబుఁ జేసి యింత దనుకన్ ♦ వెన్నాడితో రాడన
స్మద్వీర్యంబడుగంటె నోడితి జయిం ♦ పన్ జాలనిన్నింక సా
క్షాద్విష్ణుండవు నీవు కానియెడఁ దాఁ ♦ కన్ జాలునన్నేఁడు? పా
దద్వంద్వంబుల వ్రాలినాఁడ నిఁక నా ♦ దౌరాత్మ్యముల్ సైఁపుమా॥

క్రు — జాంబవంతా! మనభుజబలంబుల తారతమ్యంబిప్పటికైన నీకు బోధపడినదా?

జాంబ — స్వామీ! చక్కఁగా బోధపడినది

సీ॥ భువనసంతతి సృజిం ♦ చు విరించి యెవ్వాని
బొడ్డు కెందామర ♦ పురుటిపాప

సిరులిచ్చిరక్షించు ♦ తరళాక్షియెవ్వాని
పేరురంబున కర ♦ విందమాల
విశ్వపావనమై ♦ వినువాక యెవ్వాని
యడుగుఁదామరలోని ♦ యలరుఁదేనె
భూభారమువహించు ♦ భోగీంద్రుఁడెవ్వాని
పడక కేర్పడిపట్టి ♦ పట్టుపాన్పు
గీ॥ సురలనెదిరించి వేల్పుటో ♦ గిరముగొన్న
పక్షిరాయఁడెవ్వానికి ♦ నెక్కిరింత
విశ్వమయుఁడైనయామహా ♦ విష్ణువీవ
దేవదేవ! యనంతకీ ♦ ర్తిప్రభావ!

మ॥ మనునంశంబున భూధరంబుదొలగిం ♦ పంబుట్టి, ధర్మప్రవ
ర్ధనకీర్తిన్ ధరణీసుతన్‌గొని, సుమి ♦ త్రాపుత్రుతోఁగానకున్
జనకాజ్ఞంగొనియేగుదెంచి, ఖరర ♦ క్షస్సంఘముల్‌దున్మి మా
కనుకూలించినరాఘవేంద్ర! గుణసాం ♦ ద్రా! నిన్ను ధ్యానించెదన్

శా॥ సుగ్రీవప్రముఖుల్ బలీముఖులు నీ ♦ మన్ననమ్మొరాదంచు నే
కగ్రీవమ్ముగనాడినన్ గృపణర ♦ క్షాదీక్షఁజాటింప నీ
తిగ్రస్తుండగువైరితమ్ము శరణా ♦ ర్థింబ్రోచు నిష్కారణ
వ్యగ్రాగ్రహధీరరాఘవపర ♦ బ్రహ్మంబు నన్నేలుతన్

మ॥ అరుణాంభోజవిలోకనోగ్రమును బ ♦ త్యాలీఢపాదంబు రౌ
ద్రరసావేశమహాట్టహాసవికటో ♦ గ్రభ్రూలతాబంధన
త్వరితంబుల్, దశకంఠలుంఠనపటు ♦ బ్రహ్మాస్త్రసంధాన ధు
ర్యరమోఘాయితవీరరాఘవపర ♦ బ్రహ్మంబు నన్నేలుతన్

[అని నమస్కరించి]

పురాణపురుషా! లీలామానుషవిగ్రహుండవైననిన్ను దొంతసాక్షాద్విష్ణువనియెఱుంగక గర్వాతిరేకంబున నపరాధంబొనర్చినందులకు నన్ను క్షమింపవలయును.

ఇదిగో మణితోఁగూడ నాకుమారీమణియైన జాంబవతినిగూడ నీకుసమర్పించుచున్నాఁడను పరిగ్రహించి నన్ననుగ్రహింపవలయును.

కృ—భల్లూకపతీ! సఖ్యమే గాక నేఁటినుండి యీఁ జుట్టరికముగూడ లభించినందులకు సంతోషించితిని.

గీ॥ ధీరమతివీవు రామావ ♦ తారమందు
గపులతోఁ బాటునాచెలి ♦ కాఁడ వైతి
పోరి యిప్పుడు కృష్ణావ ♦ తారమందు
గన్యయనొసంగి నామామ ♦ గారి వైతి॥

మామా! నన్నొక్కమారుగట్టిగాఁ గౌఁగిలించుకొనుము. నీశరీరంబిప్పుడు వజ్రశరీరం బయ్యెను. మణితోడను నీకుమారీమణితోడను బ్రయాణమయ్యెదను. నాకు సెలవిమ్ము.

[ఆకాశమున] కృష్ణా! నేను దేవదూతనగు గంధర్వుండను క్రూరుం డగు నరకాసురుం డమరావతీపట్టణమెల్ల ముట్టడివేసి పూజ్యులగు శచీబిడౌజులం జెఱఁబెట్టి చిరకాలకష్టంబున నమృతకుంభముగొని యిదెపోవుచున్నాఁడు. దీనజనబాంధవుఁడవగు నీవు దేవకార్యమున నప్రమత్తుఁడవై వర్తించినంగాని సుధాకుంభము దక్కనేరదు దేవా! త్వరపడుము త్వరపడుము.

కృ—(తనలో) నేనిప్పుడేమి చేయుదు? ప్రియురాలగు సాత్రాజితికి నేఁడిచ్చినగడువు గడచిపోయినదికదా. నాకై యాకామిని యెంత పరితపించుచున్నదో? ఏది యెట్లయినను దేవకార్యమనివార్యము. పరోపకారార్థము స్వార్థత్యాగమొనరించినవాఁడేకదా ధన్యతముఁడు (ప్రకాశముగా) దేవదూతవగునో గంధర్వా! ఇదిగో నేనువచ్చుచున్నాఁడ మీరిఁక జడియకుఁడు. మామా! నేను తిరిగి కొలఁదినాళ్ళకేవచ్చి నీకుమారింగొనిపోవుదు. ఆలస్యమయ్యెనేని నీవ మాపురంబునకు నీసుతం దోడ్కొనిరమ్ము. సెలవుగైకొనెద.

జాంబ—కృ ! తుష్టుసుమీ

కృ—ఎన్నటికిఁ దలంపకుము (నిష్క్రమించును)

జాంబ—నేఁడుగదా నాజన్మము సార్థకంబయ్యె (నిష్క్రమించును)

♦ఇది తృతీయాంకము♦





# సాత్రాజితీయము



## చతుర్థాంకము.

[మంజువాణి పూలపుట్టికతోఁ బ్రవేశించుచున్నది.]

"మంజువాణీ! నేఁడుసాయంకాలము నామనోనాథునకు శుభంబుగా దుర్గాపూజ నిర్వర్తింపవలయును నీవుద్యానవనమునకేగి మందారవకుళచాంపేయాదికుసుమంబులఁగొని కళావతితోఁగూడ సత్వరముగరమ్ము" అని భర్తృదారిక చెప్పినది కదా నేను త్వరపడవలయును, కాని యిప్పుడు కళావతికై యెక్కడ వెదకుదును. ఎందులకో యెప్పుడాపాపము శతధన్వునితో దానికి గుసగుసలు. ఏమైన నేడ్చికొననిమ్ము నాకేమి నేను నాపనిమీఁదఁ బోవుదును.

(కళావతి యావలప్రక్కనుండి ప్రవేశించి)

ఏమే మంజువాణీ! ఎదుటనున్న నన్నుజూచి మాటాడకయే పరువెత్తుచున్నావు. ఇంతలోనే యైశ్వర్యము వచ్చినదఁటే?

మంజు — నాకేమియైశ్వర్యమురాలేదే పనితొందరమీఁదఁబోవుచు నిన్నుజూడనయితిని.

కళా — అంత పనితొందర యేమివచ్చినది?

మంజు — నేఁడు సాయంకాలము దుర్గాపూజకై పూలఁదెమ్మని భర్తృదారిక చెప్పఁగా నుద్యానవనమున కేగుచుంటిని. నిన్ను బిలుచుకొని రమ్మని చెప్పినది. అదృష్టవశమున వెదకనక్కరలేకుండ నిక్కడనే దొరకితివి పోవుదమురా?

కళా — (స్వ) ఓహో! కృష్ణసమాగమునకై కాఁబోలు నిప్పుడీ దుర్గాపూజ. ఈవిషయ మాశతధన్వుని కెఱిఁగించిన నతఁడేదయిన నుపాయముచే నీపెను దక్కించుకొనునేమో. (ప్రకాశముగా) మంజువాణీ! నీవు పోయిరమ్ము. నే నిప్పుడే మిమ్ముఁ గలిసికొనియెదను.

[ఇరువురు నిష్క్రమింతురు]

(ఇది ప్రవేశకము)

[అనంతరమున సాత్రాజితి మంజువాణితోఁ బ్రవేశించుచున్నది.]

సాత్రా—మంజువాణీ! దుర్గాలయమునకు దారిదీయవే.

మంజు—భర్తృదారికా! ఇటు యిటు.

సాత్రా—ఏమే! నేఁటిదినము గూడ గడచినట్లేకదా? ప్రియుఁడింకేమివచ్చునే?

శా॥ లలనా! యెక్కడనున్నవాఁడో ప్రియుఁడే ♦ లారాఁడో? యెందేనియున్
గలయందిప్పురి వేసటన్ మణికినై ♦ గాసిల్లెనో లేనిచోఁ
బాలయుల్కుంబచరించి నాథునివాసం ♦ బున్ దిప్పెనో భైమి, హా
కలకాలంబిటు చింతతో జరుగనా ♦ ఖ్యంబెన్నఁడేనాకిఁకన్?

మంజు—నెచ్చెలీ! అధైర్యపడకు నీపై వలపులేక యతఁడింతకాలము మసలలేదు. కాని మఱేదియో యొకానొక బలవత్కారణమున నతనికి రాను దీరిక లేకుండ వచ్చునని నే నూహించెదను.

సాత్రా—మంజువాణీ! నీవును నావలె పట్టివెఱ్ఱిబాగులదానవేసుమీ కుడుము చేతికిచ్చిన పండుగయని యుబ్బుదువు. ఇంతకు నేనెంత పరిహాసపాత్రురాలనైతినే!

ఉ॥ అక్కట! జేనెనె వలపు ♦ లాఱడివో వెలియైతిఁగాక, నా
దిక్కనకాతఁడేటికిరు ♦ దెంచు? మణిన్ గణియింపవానికే
మక్కఱ? యింతగా మసలు ♦ నావలపున్నప్రియుండు? బాగుబా
గొక్కటె కాపురంబునకు ♦ నవ్వెళులాడిన దక్కనేర్చునే?

మంజు—నెచ్చెలీ! నీతో నాడంతయనురాగమున మాటాడి మణినెట్లైన గణియించి తెత్తునని పెక్కుబాసలిచ్చి ముక్తాహారమును వలపుఁగానుకగాఁ బరిగ్రహించి యేగినవాఁడు నిన్ను మఱచునఁటే?

సాత్రా—అక్కటా! ముక్తాహారపుమాట స్మరణకుఁదెచ్చి నామనస్సును మఱింతకలఁతపఱచితివిగదా. (ముక్తాహారము నుద్దేశించి)

మ॥ తరుణీ! నీవె యదృష్టశాలివి సుమ్ ♦ కామాలికా! గోపికా
వరశృంగారగళోపగూహనముఁ ♦ భాసిల్లి హైమాంబుశ్రీ
కరగంధాకుల నస్మదీయతనువో ♦ గ్రక్రాంతి సంతాపదు
ర్భరమున్ బాసికృతార్థతన్ గుణవతీ ♦ ప్రామాఖ్యముంగాంచితో॥

మంజు—నెచ్చెలీ! ఊరడిల్లుమూరడిల్లుము

సాత్రా—ప్రాణసఖీ! నాకూరటజనించుటెట్లు. ఈయుద్యానమున నెక్కడఁజూచినను బ్రాణిలోకమెంతసంతోషమునఁ దమజీవయాత్ర గడుపుచున్నదో చూడుము.

సీ. వెలిదమ్మిమెడమొడం ♦ బెనవైచికొని కన్ను
లరమోడ్చి కనికెదు ♦ నంచబోయి
మావిలేజిగురుఁ ద ♦ మ్మిలమొండొరులనోళ్లఁ
గలిపి సేవించుకో ♦ యిలలజంట
బొందువల్లియుపల్లె ♦ మునయుండు జతగూడి
తేనెమోగిరమాను ♦ తేఁటిజోడు
కులుకుటొయ్యారంపుఁ ♦ బలుకులఁ నడకలఁ
బొంపారుపావురా ♦ దంపతులును ॥

గీ॥ ప్రకృతిలోసంతఁగన్పడు ♦ ప్రాణులెల్ల
ననఘదాంపత్యసౌఖ్యంబు ♦ లందుచుండ
నకటకట! నాకునాసౌఖ్య ♦ మనెడుమాట
దూరమైపోయెఁగదసర ♦ సీరుహాక్షి!

మంజు — ప్రాణసఖీ! నీకుసౌఖ్యపుమాటదూరముకాలేదుకడుఁగనుఁజేరువయేయగుచున్నది.

సాత్రా — చెలీ! ఇదేమిమాట? నాప్రియుఁడు శ్యమంతకమునకై యేగి యొకవత్సరముకంటె నెక్కుడుకాలేదఁటే?

మంజు — ఎక్కుడిదే? ప్రియవిరహమునఁ గాలము నీకట్లు దుస్సహముగాఁ దోఁచుచున్నదికాని గడువుగడిచి వారముదినములకంటె నెక్కుడుకాలేదు.

సాత్రా — అక్కటా! గడువు గడిచియేపోయెనుగా! ఇంకనే నేమనిజీవింతునే?

చ॥ గడువను తెప్పనూది మున్నుఁ ♦ గొంబడ కేవిరహాబ్ధి నాసతో
గడచెదనంచు నింతదను ♦ కన్ వెడనీదితి నిఁకనిప్పుడో
పడతి! గతించెనాసయు; న ♦ భంగురభంగవినయ్యైనా
గడువను తెప్పయుం జెడితిఁ ♦ గా కడియాసతోడ నేమునుఁగన్ ॥

కావున,

మ॥ మనసా! యాసలఁ బెంచికొంచుఁ దపియుం ♦ పంగోకుమిం కేని చే
మనిమోహించితివైసిమాలి బహుకా ♦ లానీవు సుం
త నిజంబౌనభిజాతగౌరవమెయు ♦ న్నసీకు వైరాగ్యము
న్గొనియాకృష్ణునియుందెకా దఖిలమున్ ♦ మన్నిస్పృహన్ జెందుమా॥

మంజు — భగవానుఁడైన కృష్ణునియందుఁగూడ నిస్పృహవైనచో నీవైరాగ్యమునకు ఫలమేమున్నది.

సాత్రా — పేరాసనుండిమాత్రము పొందుచున్న ఫలమేమి చెప్పుము? అదిగాక స్వీయకాంతాభోగ్యుఁడైనవాడు నాకెట్లు భోగ్యుఁడగును?

మంజు — నెచ్చలీ! నీవూరక హతాశురాలవుగాకుము. నేనిప్పుడు కృష్ణునిమందిరంబున కేగి సమయోచితములైన వాక్యముల నాతని మనసుఁ గరఁగించి నావెంటఁదోడ్కొని వత్తును ఇంతలో నీవు దుర్గాపూజ నిర్వర్తింపుము.

సాత్రా — ఓసి వెఱ్ఱిదానా! నీవేమికృష్ణుని దోడ్తెచ్చుటేమి! ఎంతయనాలోచనముగఁ బల్కితివే? చూడు.

మ॥ సుమబాణంబులఁబోని నెచ్చెలులతో ♦ శుద్ధాంత కేళీవిలా
సముఁ దేలెడు వానిఁ జూచుట తట ♦ స్థంబౌనె? నీకయ్యెనే
ని మదీయుంబగునీయవస్థ నెటువి ♦ న్నింపంగ సాధ్యంబగుఁ
రమణీకోటి కెఱుంగకుండఁ? వలదీ ♦ ప్రారంభముల్ వ్యర్థమా

మంజు — నెచ్చలీ! ఇంతయేందుకు? నేను సమయమెఱిఁగి కృష్ణునింగాంచి నీకతనినుండి ప్రత్యుత్తరముఁ దెచ్చినప్పుడు నన్ను "మంజువాణీ" యని పిలువుము.

సాత్రా — మంజువాణీ! నీయిప్పటిపల్కులను నమృతపుఁ జినుకులచే నాయాశాలతిక మాఱాకువేయుచున్నది. కావున నిప్పుడె యాకృష్ణునిమందిరమున కేగి నయవినయముల నాతనిమనంబుగఱఁగించి యిట్లనుము. "కృష్ణా! నాఁడంతయనురాగమున మా చెలిఁ బలుకరించి మఱలమొగమైనఁ జూపకుండుట నీయట్టిరసికునికు దగినపనిగా? అయ్యో! మా సాత్రాజితి యవస్థయేమని నీకువక్కాణింతును" అని మఱియు నిట్లనుము.

సీ॥ ఎలదోఁటలోనాఁడు ♦ దిలకించుటే మొదల్
కన్నారనిద్దుర ♦ గాంచదనుము
ఎవరేమి సెప్పిన ♦ యువిద నిన్నే కాక
యితరునెవ్వని వరి ♦ యింపదనుము
సుదతి నీరాకకై ♦ యెదురుఁజూచుచునుండి
క్షణము యుగంబుగా ♦ గడపుమనుము
మదనాతపముచేత ♦ మఱుగుమైదీవతో
నతివ యిప్పుడు సగ ♦ మయ్యెననుము

గీ. ఒడలుమాత్రింబె చెలిచెంత ♦ నుండెననుము
చిత్తమంతయు నీయుందె ♦ హత్తెననుము
వలపులేకున్నఁగబ్బురైన ♦ బంపుమనుము
బ్రదికియున్నదిదానికే ♦ పడఁతియనుము.

మంజు — ఇఁకఁబోలును; నేఁ బోయివత్తు.

సాత్రా — పోయిరమ్మా. నీకు దారిలో శుభశకునము లయ్యెడుఁగాక. మఱల దుర్గాలయమున నన్నుఁ గలిసికొనుము.

మంజు — అలాగే. (పోవుచుండ)

సాత్రా — (మంజువాణింబిలిచి) నెచ్చెలీ! సరసాగ్రేసరుఁడగు కృష్ణునితో నీవు సమయమెఱింగిక మాటాడెదవుసుమీ!

మ. కనిపెట్టందగు నాథుమోముఁగనియే ♦ కార్యాంతరాసక్తి నుం
డెనో కోపంబుననుండెనో యతని నిం ♦ తీ! యంతనె వార్తలున్
వినకుండన్ జెవిలోన నంతయు రసా ♦ విర్భూతి, శీఘ్రంబుగా
వినిపింపందగు నాయవస్థ బతికిన్ ♦ విజ్ఞప్తిమూలంబుగన్.

మంజు — అయ్యో! నాకిన్ని చెప్పవలయునఁటే!

సాత్రా — నీకన్ని యుండదెలిసియున్నను నాయపేక్ష చేనింతచెప్పితి. కోపింపకుము. పోయిరమ్మా. నేనొక్కతె నిక్కడనుండుదునని సందేహింపకుము కళావతియిప్పుడే వచ్చును.

మంజు — (నిష్క్రమించును.)

సాత్రా — (స్వగతము) మంజువాణి తెలివితక్కువదిమాత్రముకాదు. కార్యము సాధింపనేవచ్చును. ఇంమీఁది ప్రేమచేనిక్కడియంజ నక్కడకువేసి యీపాటికవ్వాడే కృష్ణుని మందిరముఁ బ్రవేశించియే యుండును కాని, నేనెంత తెలివితక్కువ పనిచేసితిని!

గీ. పోఁతి యటకేగి యేమేమి ♦ పలుకఁగలదొ
చెలియపలుకుల కతఁడేమి ♦ దలఁచునొక్కొ
వలపుగలిగిన నతఁడె రా ♦ వలయుఁగాక
పిలువఁబంచినఁ జులుకన ♦ నటుపడొక్కొ.

ఏమో యెట్లుకానున్నదో భారమంతయు మాతల్లిదుర్గపైనిడి దేవి కొలువునకుఁబోయెదను.

(నిష్క్రమించును.)

[పిమ్మట నొకమూలనుండి కళావతి శంబరాసుర శతధన్వులతోఁ బ్రవేశించును.]

కళా—(దూరముననుండి సాత్రాజితింజూపుచు) శతధన్వుఁడుగారూ! అదిగో నీవలపులదీవి సాత్రాజితి. ఇప్పుడామెయొంటరిగా దుర్గాలయము సమీపించుచున్నది. ఇప్పుడైన మెలఁకువతో నామెను దక్కించుకొనుము. వెనుకటివలెఁ జెలివి తప్పుకవగానుండి తెల్లమొగముతో నాకడకువచ్చి నన్నుదూరవలదు ఇంకొకంటె నీకు మంచిసమయము చిక్కదు. ఎట్లు దానినిస్వాధీనము గావించుకొందువో ఇదిగో నావలన నేరములేకుండ నీకామెను నొంటరిగా నగపఱచితిని వేఁపో యిపత్తును నేనిక్కడనున్నయెడల నన్నుసందేహించును. కార్యాంతరమున నాబహుమతికిమాత్రము పంగనామము సేయకుము.

శత—సరే పొమ్ము (అని శంబరుంజూచి) మిత్రమా! శంబరా! ఇప్పుడేయుపాయమునఁ దానికీయొప్పులకుప్ప నప్పగించెదవు?

శా. ఈరామామణి, యావిలాసవతి న ♦ న్నేకోరి పెండ్లాడినన్
స్వారాజ్యంబదియేల? దన్యములలం ♦ చాలిచ్చి మేనాఘృతా
చీరంభాదిననీముఖత్రిదశయో ♦ షిదత్నముల్ నన్నుఁదా
వైరించమ్మనన్న నీసీ! యటంచవలమో ♦ మైధీరతం బోవనే.

శంబ—మిత్రమా! శతధన్వీ! ఊరక యుబ్బిళులూర నేమిప్రయోజనము? సమ్ముఖంబునకువచ్చి రాయబారములుసల్పనేల? నీవాచాచమత్కృతిఁజూపి యాకన్యాలలామ వశంబుజాడ నారయుము.

శత—దీనిమనముజాడ నిప్పుడారయుట యేమి? ఇదివరకెంతయో ప్రయత్నము సల్పితిని. దీనికి నాపొడయన్ననే గిట్టదుగదా. అందుచేతనే,

మ. ఎలసిగ్గుంగొని కాదు న్గొనదు క ♦ న్నెత్తి పేకీసున
న్బాలయుల్కన్ వహియించికాదు పెడమో ♦ ముంబెట్టురోషంబునన్
పోలుపుంజాపులఁగాదు, చూచు విరసం ♦ పుంజూపులన్ నన్నునీ
లలనారత్నము దీనెట్లు సరసా ♦ లాపంబులం దేల్చెదన్?

మఱియు,

శా. నాయందెప్పుడు మాఱుమోము నిడు క ♦ న్యారత్నమిద్దాని మో
హోయాత్తుఁడను పల్కరింపఁగడు హా ♦ స్యాయత్తహా నేదియో

మాయోపాయమువన్ని దీనిగ్రహియిం ♦ పం జెల్లునేకాని యీ
యాయత్నంబులఁ జెంత కేఁగఁగడునే ♦ హ్యంబుః రసాభాసమా.

కావున నేయుపాయమున దీనిసంగ్రహించెదవో? మిత్రమా! నీకయే భారము.

శంబ—అట్లయిన దేవింగుఱించి యీ మెకావించు ప్రార్థనముచే నీమెమనంబెవ్వరి యందున్నదో స్పష్టముగాఁ దెలిసికొనవచ్చును. నేనుపోయి గర్భాలయమున దేవికి వెనుకగా నొదిగియుండి యిప్పుడొకపన్నగడఁ బన్నెదను. నీవీమెకుఁ గనఁబడకుండ నీపాదయందొదిగియుండుము.

శత—నీవెట్లు చెప్పినట్లాచరించెదను. (పొదయందు డాఁగును)

శంబ—(దేవికి వెనుక నొదిగియుండును.)

సాత్రా—(దేవికభిముఖముగా నిలిచి ప్రాంజలియై)

దేవీ! విశ్వజననీ! కొండొక కార్యసిద్ధికై నీపదాబ్జముల నాశ్రయించితి. దుర్లభ జనానురక్తనైన నన్ను విఫలమనోరథంజేయక విరహాబ్ధిదరిఁజేర్పనీవే యొక నాథవై నన్ను రక్షింపుము. జంగమస్థావర విశిష్టంబగు జగజ్జాలంబునకెల్ల సాక్షీ భూతవగు నీకు నామనోరథం బేదియో తెలియకున్నదే తల్లీ! మఱియు,

గీ. ఆరయ సర్వజ్ఞురాలగి ♦ వైన నీవు
నేనెఱింగింపనేల నా ♦ యింగితంబు?
ఆర్తనై యున్న నాకుయి ♦ నాలకించి
యీరడింపు మభీష్టవ ♦ రోపలబ్ధి.

దుర్గ—వత్సా! సాత్రాజితీ! నీయభీష్టము మిక్కిలిగౌరవాస్పదముగానున్నది. మేమిది వఱకే నీయింగితమెఱింగియున్నారము. కాని నీవందని మ్రానికట్టుసాచినావు కేవలము విధికింబ్రతికూలమగు నీకోరిక దుర్లభము సుమీ!

సాత్రా—హా! కృష్ణా! నేను నీకిల్లాలినై నీపరిచర్య యొనరించుట విధికే ప్రతికూలమైపోయెనుగా హా! హతవిధీ! (అని మూర్ఛిల్లును)

దుర్గ—బిడ్డా! దుఃఖించినప్రయోజనము లేదు. వేయిమాటలేటికి నీకీజన్మమున శతధన్వుడే పెనిమిటి కాఁదగినట్లు విధిచే నిర్ణీతమైయున్నది.

సాత్రా—అయ్యో! అయ్యో! శతధన్వుఁడేనా నాకీజన్మమున! ఆలాగైనఁబ్రాణపరిత్యాగ మొనరించుకొననే నేల జాగొనరింపవలయు?

దుర్గ—బిడ్డా! నీవూరక సాహసకర్మంబులందిగకుము. శతధన్వియైనను గులశీలవయో రూపములఁ గొఱంతపడినవాఁడుకాఁడు.

సాత్రా — తల్లి! నీవుగూడ నాపాలిశతధన్వి పక్షమే యంగీకరించితివా? ఆర్తత్రాణ పరాయణవైన నీచేతగూడ నిట్లు పరాభవింపఁబడి దురాత్ముఁడగు నాశతధన్వి కీయొడలొప్పగించి నేను జీవించియుందునా? తల్లీ! చూడుము,

మ. అనయంబుండగు ధర్మచేష్టలమి క ♦ న్యాత్వంబు చేటొంట తీ
ప్ప నిజం బేమిసుఖంబొ యాపయిఁ బుపుదాం ♦ పత్యంబుఁ జాలు నో
జననీ! యాశతధన్వతోఁ జెలిమి వే ♦ జన్మాంతరంబుల్ వల్దిఁకన్
దనువుం బాసెద ముందుజన్మమున కై ♦ సంగూర్చుమా మాధవున్.

(అని నిరాశతో) హా ప్రాణకాంతా! హా! రుక్మిణీప్రియా? హా! యశోదాకిశోరా! హా బలానుజా! హా! కామినీమన్మథా! నీకుఁగాని యీ నాశరీరముతో నాకేమి ప్రయోజనము? హతాశురాలనై నేను నీకై ప్రాణపరిత్యాగ మొనరించికొనవలసి వచ్చెనుగదా! కృష్ణా! కృష్ణా! నీచేత నుపలాలింపఁదగని యీ నీచజన్మము నాకేల యాపాదించెనో? అకటకటా! ఎంతటి నిరర్థకపుఁ బుట్టువొందితిని,

సీ. అకట! పిల్లనగ్రోవి ♦ నైనఁగానైతి నీ
యధరామృతముఁ గొంత ♦ యానుచుండ
నలతులసీమాల ♦ నైనఁగానైతి నీ
మెడఁ గౌఁగిలించి నె ♦ మ్మందనర్తు
నలకౌస్తుభమును గా ♦ నైతి సంతతము నీ
పేరురంబున న్వ్రాల ♦ రారుచుండ
నలనెమ్మిపింఛంబు ♦ నైనఁగానైతి నీ
యుత్తమాంగమునఁ ద ♦ ళ్కొత్తుచుండఁ
గీ॥ బడమిఁ గొల్లమాలనీ కూడఁ ♦ బుట్టువొంది
ప్రాకుమారడివోదైన్య ♦ పడితిఁ గాక
తుదకు నీమందలోనొక్క ♦ తొఱ్ఱగుచుఁ
బుట్టనైతిఁ గదా! యిఁక ♦ నెట్టియాస!

హా! కృష్ణా! మందభాగ్యురాలనగు నాకోర్కెలన్నియు నేఁటితోఁ బరిసమాప్తినొందినవి కదా!

సీ॥ చిన్నారికోడలీ ♦ చెలువ దేవకికంచు
ప్రియ నన్నులక ముద్దుఁ బడయనైతి
కొమ్మ కిన్నెరసీతతోడి ♦ కోడలుగాదఁటే
సత్య నా నుడికేను ♦ జాలనైతి
పాంచాలి ద్రౌపదికాదు ♦ బిడ్డనై పాండవు
లనుసరింపఁగ వాసి ♦ నందనైతి
నెలజేనితోడి వె ♦ న్నెలలీల నేనీకు
నర్ధాంగినై కీర్తి ♦ నందనైతి
గీ॥ కోర్కెలన్నియు నేఁటితోఁ ♦ గాలిపోయె
నెవరికో యికశరీరమింకేటి బ్రతుకు
తనవుఁజాలింతు నింక మాం ♦ దటికినైన
నన్ను గ్రహింపుమయ్య యో ♦ నల్లనయ్య!॥

[అగ్నిఁ దీఁగె మెడఁ దగిలించుకొనును]

శత— (హఠాత్తుగాఁ బ్రవేశించి)

శా॥ చాలుంజాలును గట్టిపాయి పడఁతీ! ♦ శాంతింపు మీపాటికిన్
బోలుంగోలను జెంచకీకడిదిచా ♦ పుంజత్తువేసీ చగో
పాపంగాని వరింపనొల్లవు తలం ♦ పన్ స్వర్గమా మోక్షమా
బాలా! యీగనేస్త? మెంతకుఁ దెగిం ♦ పంజాలిన వక్కటా!

సాత్రి—అయ్యా! శతధన్వా! ఇప్పుడు నీవు నాప్రయత్నమును భంగముగావించి నాజీవనమును మఱింత దుఃఖభాజనముగా నొనరింపకు.

శత—. చెచ్చెలీ! నీకేమిటఁగో యింతయని నీజీవనము దుఃఖభాజనమగు? అయ్యో! నీకెక్కడి సాహసము?

మ॥ అలరుంబ్రాయము నేఁబ్రదోసి, యుహసా ♦ ఖ్యానందమున్ద్రోసి నె
చ్చెలిపిండంబెడఁబాసి, కన్నకడుపుం ♦ జిచ్చాచితిన్ జేసి ని
చ్చలి మిఁగోరి తపించు నిబ్బరముగా ♦ సింజేసి యేమంచుఁదో
య్యాలి! యేటికివోసికోఁగడఁగితా ♦ హా! యెంతగయ్యాళివే॥

సాత్రా—అన్నా! శతధన్వా! నాతో వదరాకుము.

చ॥ ఎఱుఁగుదు నీమనోవికృతి ♦ నీవు నెఱుంగుదు నామనస్స్థితిన్
దలఁచిన నేమిలాభము వృ ♦ థా దురపేక్ష వహింపఁబోకు నా
కొఱకు; మదీయమానసము ♦ గోపకిశోరునియందె గాఢమై
వాలెదు నానుసన్నపుసు ♦ మా యిఁకనొందుతలంపు మానుమీ॥

శత—కామినీ! నీవు బొత్తుగాఁ బెడతోవం దొక్కుచున్నావు నీపై మోహావేశమున నాడినమాటలుగావు నీకై నేనింత చెప్పుచుంటిని. కృష్ణునియందు నీవెంతయో దుర్భ్రాంతి వహించియున్నావుగాని వానినడవడి సుంతయోజింపవైతివి; చూడుము.

సీ॥ అరయఁగొంపాగోడి ♦ యావానికొకవంక?
నూళ్ళన్నియును వాని ♦ యుఁకిపల్లె
తనవారు నావార ♦ లనియెక్కడిది వాని?
కందఱుగారాదు ♦ రతనివారు
అచ్చుగనొకగుణం ♦ బావానికి కవగుణం
బులగుణంబులనొక్క ♦ లలిజరించు
ఉపమింపనొకకులం ♦ బున్నదే? కడజాతి
యె గిలికేఁయు ♦ నేనపడఁడు
గీ॥ చక్కఁదనమెన్నఁదమఁటన్న ♦ నొక్కగాపు
చందమేర్పడునేవాని ♦ యందుఁబోల్ప?
గోం! నీవిట్టినామాటా ♦ పాలులేని
వెడఁగువలచితి విగ్నేమి ♦ వెత్తిచెప్పుమ?॥

సాత్రా—ఛీ! ఛీ! కృష్ణదూషణ మొనరించు నీముఖముఁ జూడఁగూడదు పొమ్ము.

శత—ఓసియజ్ఞానురాలా! ఎందునకై నాపై నీకీయనూయ? నిజం బాడిననీకు నిష్ఠురమాఁ గాని,

ఉ. నాతిరో! కాఱుమబ్బువలె ♦ నల్లగఁ లేనివియూ? పదారువేల్
వేశ్యలతోడ వేగెడుప ♦ విత్రుఁడగానని యూ? మఱెందుకీ
మూఁతిబిగింపు నన్నదిఁ? ముద్దియ! ♦ నీకలవెన్నదొంగదే
తాతలనాఁటిచుట్టమయి ♦ తాశతధన్వుఁడుగాకపోయెనే ?

సాత్రా—అయ్యా! శతధన్వీ! నాపై నీకేటియనూయ? నీవు సాక్షాన్మన్మథుఁడవే యనుకొమ్ము; అయినను నీయందుఁగాక కృష్ణునియందు బద్ధానురాగనగుటకు గారణముఁ జెప్పుమన్న నీకు నేమని చెప్పుదును చూడు,

చ. తొగమొగమున్ ముడింపికొనఁ ♦ గోయజమిత్రుని దోసమే మొ యిం
పుగ వికసింపఁ జంద్రికృత ♦ పుణ్యమదేమొ యెవండెఱింగెడిఁ
బగయొ ప్రియంబొ యొక్కకరి ♦ పైన నొకప్పుడ కారణంబు గాఁ
దగులు; ననన్యవేద్యము, న ♦ తర్క్యము దీని నెఱుంగు దుర్మతీ!

మఱియు,

గీ. చక్కఁదనముగాదు ♦ సరసత్వముంగాదు
కులముధనముచదువు ♦ గూడఁగాదు
పడఁతి యొకని మేలు ♦ పడుటకు మూలంబు
జడుఁడ! వారిపూర్వ ♦ జన్మకృతము.

శత — ఏమీ నేను జడుఁడను దుర్మతినా? నీవు సన్మతివా? కానీ యిప్పుడేల? నీవా బిత్తిగొల్లతోఁ గాపురముఁ దిద్దుకొనుట నేఁజూడకపోవుదునా? అబ్బో! ఆభోగ భాగ్యము లనుగవలెనా? నీవాగోపాలునే కట్టికొమ్మ,

సీ. చలిదిచిక్కాలూని ♦ ఛలగోలఁ జేఁబూని
కానలోఁ బసులను ♦ గాయవచ్చు
ఊరూరఁ బెరుగుపా ♦ లోయమ్ముకొను'' డంచుఁ
గుండ మూపునఁ బెట్టి ♦ కులుకవచ్చు
పదియాఱువేల స ♦ వతులతో సిగపట్లు
ముచ్చటలను ప్రొద్దు ♦ బుచ్చవచ్చు
మగఁడూరఁ గొంపఁ గొం ♦ పలఁ దోఁచి తెచ్చిన
గడవతో నీవిల్లు ♦ గడుపవచ్చు

ఆ. వె. ఇన్నిసిరుల కేమి ♦ యింతటనంతట
గొల్లవారియింటి ♦ కోడలవని
అవని లోకులెల్ల ♦ ననుకొన్న చేచాలు
వన్నెవాసినీకు ♦ నన్నుమిన్న!

సాత్రా—ఛీఛీ! మూఢమతీ! పరనిందాపరాయణా! అలౌకగుణసంపన్నుండును భగవంతుఁడునగు కృష్ణుని దొంగయనిదూషించుటను నీ వామహామహుని మహిమం బేమియుఁగనుఁగనవు? చూడు,

సీ. ఘన యోగిజనమనో ♦ ధనము ప్రచ్చిలియెందు
దొరకకుండెడుగజ ♦ దొంగయగుఁడు
మక్తికాంతామణీ ♦ సక్తులౌవిటులకు
వెరపుఁజూపెడు పెద్ద ♦ విటుఁడతండు
పలువతారకక్షసి ♦ పసులనునదలించి
ఘనతఁజెందినమంద ♦ గాపతండు
వసుమతియనుగోవు ♦ వలనధర్మంబులు
బాలుఁబిండెడుగొల్లఁ ♦ వాఁడతండు
గీ. అన్నిగుణములతోనిండి ♦ యున్నవాఁడు
గుణములకతీతుఁడై నెల ♦ కొన్నవాఁడు
వెడఁగ! నీవేల నేనెతె ♦ ల్పెదనువినుము
దొంగలకుదొంగ దొరలకు ♦ దొర యతండు.

శత—ప్రేమాధిక్యముచేఁగృష్ణునిఁ భగవంతుఁడని యెన్నినిఁజెప్పఁగలవు చూడు,

గీ. తనకుఁబ్రియమౌపదార్థంబు ♦ ననుగొఅంత
యొంతయుండినఁగనఁబడ ♦ దింతయేని
చండభానునిలోనివె ♦ చ్ఛందనంబు
కలువకేకాక నలినికిఁ ♦ గానఁబడునే?

సాత్రా—నిజమే కనఁబడదుకావుననే,

మ. అడియూసంపడఁగోకు నానలన నీ ♦ కావంతయో సౌఖ్యమే
ర్పడ దన్యోన్యము చిత్తముల్గలిసి నీ ♦ రక్షీరమట్లున్న య
ప్పుడు సంసారము రక్తిగాక పెడమో ♦ ముంబెటునాతోడ నీ
కడుగ్గి బడిసాగునే? పడకషా ♦ మైన్ము వేధింపనే?

శఠ—కాంతా! నీకింతటిమూఢప్రచారము తగదు. సిరిరా మోకాలడ్డినట్లు నాయంతవాఁడు నిన్నపేక్షింప సవినయమునఁ ద్రోసివేయుచున్నావు. ఏల నిష్కారణముగాఁ జెడిపోయెదవు?

మ. వనభోఁడుల్పదివేలు నీకుఁగను స ♦ న్నాహ దాస్యంబు సల్ప మ
న్ననగించిన గీటుదాటక త్వదా ♦ జ్ఞల్ నేను సాగింప నా
ధనముల్ ప్రాణము నీయధీనముగ ర ♦ త్నస్నిగ్ధసౌధంబులం
దనుభోగింతువు నన్వరించిన నన ♦ న్యాహుత్ర భోగంబులన్.

సాత్రా—అన్నా! యేమిటిమాటలాడెదవు? నీవంతకంతకు నీమూర్ఖతను బయలుజేసికొనుచున్నావు నీకు యుక్తాయుక్తజ్ఞానము భగవంతుఁ డేల ప్రసాదింపఁడయ్యె?

శా. స్వాంతంబింతకుమున్నె యొక్కనిపయిన్ ♦ హత్తించియున్నట్టి శు
ద్ధాంతస్త్రీ బలవంతపెట్టి యటురా ♦ ద్ధాంతంబుగావింతె? నా
యంతర్వ్యాప్తికి నెవిరుద్ధముగ నీ ♦ యైశ్వర్యమాసించి నీ
పొంతంజేరినమాత్ర మెంతటిసుఖం ♦ బుంగాంతు నా చెంతలన్.

ఉ. మాటికిభోగభాగ్యముల ♦ మాటఁ దలంతువు; మాధవుండు నీ
పాటికి రాకయున్నె విభ ♦ వంబున రాఁడనుకొమ్ము భాగ్యపుం
గోటికిఁ బాటియెక్కడికి? ♦ కూర్మిధనంబున కమ్మ ట్టిరో
కోటికిఁ గాక నీవిభవ ♦ పుంగొడవల్కులకన్య కేటికిన్?

ఇఁక నీవెపుడుం బోకడల మానుము,

గీ. విపుల ధనవంతుఁడైన ని ♦ ష్ప్రదమైన
రూపవంతుఁడైనఁ గు ♦ రూపుఁడైన
కృష్ణుఁడెందఱ కన్యుల ♦ కింపఁ గోను
తోసితో గంగయైనఁ బా ♦ యసము నాకు.

ఇట్టి నామనోనిశ్చయము బ్రహ్మాదులుం ద్రిప్పనేరరు నీవింక నాపలుకుంబోకుము.

శఠ—ఛీఛీ! యెంతచెప్పినను నీవాగయ్యాళితనము మానవైతివి. నీమనోనిశ్చయము బ్రహ్మాదులుం ద్రిప్పనేరరుగా? ఎట్లు దిరుగదో చూచెద. సామవాక్యముల నీమనంబుఁ జేకొనుట లెస్సయని యింతదనుకఁ బెనఁగితిగాని యిప్పుడు నిన్నెత్తికొనిపో

యిన నీకిక్కడ దిక్కెవ్వరు? ఇంక నీయందు దండోపాయమే ప్రయోగింపవలయును
సాత్రా—ఏమి శతధన్వీ! నీకింతటిదుర్మతము పుట్టుటఁజూడ నీకు వినాశకాల మాసన్న మైనట్టున్నది. అకటకటా!

చ॥ మశకరి! నేఁటికెంత మతి ♦ మాలినవెంగలివైతి నన్నలా
త్కృతిగహరించితే నియువ ♦ రింతునెరిఁగ? బ్రతిమాలుచున్న మొం
డితనము మానవైతివి; క ♦ డిందిపనుల్ చనవింతనుండియుఁ గ
బ్రతుకుము నీకు మేల్పడిన ♦ భార్యనుఁ జేకొని ముద్దుముద్దుగన్.

శత—చాలుఁజాలు నీబుద్ధులు నేనువినక్కఱలేదు. మిత్రమా! శంబరా! రమ్ము ఈ అంకులాడికిఁ దగిన శిక్ష కావించినఁగాని దీనిదుర్మతముమానదు.

(శంబరుఁడు దేవిగుడినుండి ప్రవేశించును)

సాత్రా—(సంభ్రమముతో) (తనలో) అక్కటా! దిక్కుమాలి యొంటరిపాటున నీదుర్మార్గులచేఁ జిక్కితిఁగదా. ఇప్పుడు నాచేత నాయుధమున్న నీరక్కసుల నుక్కడింగించి వైతుఁగదా.

శంప—బోటీ! ఇఁక నీ మాటలు సాఁగి రావు. నీవిఁకఁ గదలుము. మామధురాపురమున కొఱకేర్పఱిచిన చెఱసాలం బ్రవేశింతువుగాని,

సాత్రా—శతధన్వీ! నీవంశక్షయమగుట నీవూహింపక దురాత్ములగు రక్కసుల దురాలోచనములనుండి చెడిపోవుచున్నావు. ఓరీ దుర్మతీ!

మ॥ పరకాంతన్ హరియించి బాగుపడె నె ♦ వ్వాఁడింకను రావణా
సురువృత్తాంతము నెన్నఁడున్ వినవె యె ♦ చ్చోనైన నై దుఃఖస
పరణంబేటికి నెత్తిఁగట్టుకొన యు ♦ ష్మద్వంశ విధ్వంసన
స్ఫురదుత్పాత ధూమకేతువు నఁటం ♦ చున్ నమ్ము నన్నీవుమా

మ॥ హితవాలింపక రాక్షసంబెకితవో ♦ ద్వృత్తింబ్రయోగింప నెం
చితివా? నేనును నస్త్రశస్త్రములవై ♦ శేష్యంబు నొక్కింత నే
ర్చితి విల్లో కరవాలమో యొసఁగి వా ♦ సింబోరుమా నేర్పుఁగా
ఘత నాయామితనంబు నీమగతనం ♦ బుంబీవు మాల్లోకముల్

శత—ఏమీ! యుద్ధమొనర్తువుగా! తొండముదిరియూసరవెల్లియైనట్లున్నది. పెట్టపెరిగి పుంజయినదే! ఎట్లూ చెప్పవు!

చ॥ వాఁడిదిరో! యింతపాటిమగ ♦ బీరము లెప్పుడు నేర్చినావు? గా
జులు దొడిగించుకొంచు సరి ♦ జోటులతో నొక మూలనుండఁగా
వలసిన యాఁడుపుట్టువులు ♦ బంటుతనంబున నేఁడు వాలు నా
బలుకయుఁ బూని వేటితుగ ♦ వారలఁ బోరికిఁ జీరుచుండ్రిగా ॥

ఏమీ! కాలమహత్త్వము! ఓసీచండీ! నిన్ను వదలినదేమి కాలమిట్లున్నది కాని నీబెద రింపులికఁజాలించి రథమెక్కుము.

సాత్రా—చీచీ పిటికిపందా! ఏమినీచపుబ్రతుకు బ్రతుకుచుంటివిరా?

గీ॥ పుడమి మగవాఁడవై తల్లి ♦ కడుపుఁ జెఱుప
జననమొంది గడ్డాలు మీా ♦ సాలు పెంచి
పడఁతిచే యుద్ధమునకుఁ బి ♦ ల్వంగఁబడియు
పందవలెయూరకుందువే ♦ పాడుబోడువ! ॥

చేతకాక స్త్రీలు యుద్ధమొనరించుట కాలమహత్త్వమని యొక పెక్కుములాడుచు న్నావుగా విద్యాశూన్యుఁడైన యోపశువా! మాఁదు,

శా॥ విల్లుం గైదువుఁ జేఁబూని సమరో ♦ ర్విన్ ఘోరవీరవ్రతో
ద్యల్లీలన్ విహరించి రెందఱు నెలం ♦ తల్ శౌర్యవిద్యాది భా
స్వల్లాభంబుల స్త్రీలకేటికి బహి ♦ ష్కారంబు? నీవంటి పం
దలజించుచు పురాణవీరయువతీ ♦ దర్పోద్ధతుల్ విన్నచో॥

మూఢుఁడా! స్త్రీజనమంతలాఘవమయ్యెనేమి?

సీ॥ చండముండాదిర ♦ క్షఃకోటినొంపదే
యాదిగర్భేశ్వరి ♦ యైనదుర్గ
ఖలులఁ బెక్కండ్రనా ♦ ర్యులగూఢమాపదే
కీరవ్రతాచార ♦ విశ్వవార
పరిపంథిరాడ్ద్వ ♦ భరమణంపదె విశ్వ
లాంకేపికీర్తివ ♦ ల్లరికిఁదావి
అరిభయంకరవిక్ర ♦ మాఢ్యగా దేవప్రి
వతియనునింతి చె ♦ ల్వాలవలంతి

గీ॥ వెఱఁగయెన్నటిమాటలో ♦ తడవనేల?
ప్రమిలయనువీరకాంత యి ♦ ప్పటిదె కాదె?
వీరిలో నీవుచెప్పు మె ♦ వ్వారికీడొ
పాడుమగరూపుగొన్న యో ♦ యాడుదాన! ॥

శంబ — మిత్రమా! దీనికంతకంతకు మాటలు హెచ్చుచున్నవి; దీనిం బలిమిమైపట్టి రథంబునం బెట్టెద. (అని సమీపింపఁబోవ)

సాత్రా — శతధన్వ! నిరాయుధనైయుండుటచే నీకుంజిక్కవలసివచ్చె. కానీ! నేనే రథమెక్కెద? నన్నిట్టు చెఱంబట్టి నీవనుభవించు సౌఖ్యమేదియో చూచెద. ఆర్తరక్షాపరాయణుండైన భగవంతుండు నన్ను రక్షింపకేల విడుచునో చూచెద. యిదే రథమెక్కితిని. (రథమెక్కి)

సీ॥ నాఁడు గజేంద్ర సం ♦ త్రాణుఁడైన దయార్ద్రి
నేఁడు నాకును దోడు ♦ నీడగాఁడె
నాఁడు రావణుపైఁ ♦ దోడు నేలిన ఱేఁడు
నేఁడు నాకును దోడు ♦ నీడగాఁడె
నాఁడు పాంచాలి బ ♦ న్నము వాపిన ఘనుఁడు
నేఁడు నాకును దోడు ♦ నీడగాఁడె
నాఁడు రుక్మిణికి మ ♦ న్ననఁ జూపిన మగండు
నేఁడు నాకును దోడు ♦ నీడగాఁడె

గీ॥ ఘనత నాపన్నరక్షణాం ♦ క ప్రసిద్ధ
బద్ధకంకణుఁడైన కృ ♦ పావమోని
సంతతాత్మైకచింత నా ♦ స్వాంత, దుష్ట
పరిభవాక్రాంతనగు నాకుఁ బ్రాపుగాఁడె

శత — శంబరా! చూచెదవేమి? మఱెవ్వరడ్డమురాకమున్నే దీనిని మధురాపురమందలి కారాగృహము చేర్పవలయును; రథము పోనిమ్ము. (రథము నడుపుచున్నారు)

సాత్రా—

శా॥ అకటా! యెక్కడ నుండ నుంటివి యెడను కృష్ణా! దీనమందార! న
న్నీకనీచుండు పరాభవించు నెడన య్యో! పోవనిమ్మంచుఁ జెం
తకునైనన్ జనుదేర వింతకఠిన త్వంబూన మేలయ్య! మా
నక నిన్నే మదినమ్మియున్న సతినిన్ నట్టేట ముంచెదే? ॥

అకటకటా! నాకింకదిక్కెవ్వరు నా యవస్థ నెవ్వరు నా మనోహరునకెఱిఁగింతురు?

సీ॥ గోపాలునకు నాదు ♦ గోడెఱిఁగింపరే
మందమళ్ళికు నాల ♦ మందలార !
మురళీధరునకు నా ♦ దురవస్థఁ దెల్పరే
శ్రుతినూనుచో మధు ♦ వ్రతములార !
రామానుజునకు నా ♦ బామెఱిఁగింపరే
శ్రీరామనుతిసల్పు ♦ చిలుకలార !
వ. మాలికీనావి ♦ పద్దశందెల్పరే
సుమనోమనోహర ♦ ద్రుమములార !
గీ॥ అరుణచేఁజిక్కి దిక్కరి ♦ యుంగలార్చు
నాకు గంపంతచీకటి ♦ నట్టిలోక
బాంధవుఁడవయ్యు నిట్లుగఁ ♦ బాడియయ్య
కరుణ నీకేలరాదయ్య ♦ కర్మసాక్షి ! ॥

శంబ—మిత్రమా! వాయువేగమున రథముఁదోలుకొనిపోయి నీవు మధురాపురమునకు జేరుము. (రహస్యముగా) నేనిప్పుడు వసుదేవునింటికేగి పుత్రులందు రామునికి జింతిల్లుచుండెడు నావృద్ధుని మఱింతయేడ్పించివచ్చెద? నీవుపొమ్ము.

(అందఱు నిష్క్రమింతురు)

ఇది చతుర్థాంకము.



# సాత్రాజితీయము

## పంచమాంకము.

(రంగము వసుదేవుని మందిరము)

(వసుదేవుఁడును అక్రూరుఁడును బ్రవేశించుచున్నారు)

వసు—అక్రూరుఁడా! ఇన్నిదినములైనను గృష్ణుఁడు మరలి రాకుండుట సంగతమేమై యుండును? నందాదులును గృష్ణునిం జూడవలయునని యెంతో కుతూహలపడుచున్నారని నిన్ననే బృందావనమునుండి వర్తమానము వచ్చినది. శాత్రవభూయిష్ఠమైన ప్రదేశములఁ బెద్దవాఁడు బలరాముఁడును వెంట లేకుండఁ గొండికవాఁ డిట్లు సంచరించుచు నింతకాలము మసలుటచే నా కేమి తోఁపకయున్నది కదా.

అక్రూ—రాజేంద్రా! గృష్ణుడు శ్యమంతకాన్వేషణమునకై బయలువెడలుట మీ రెఱుంగుదురు కదా. ఆమ్మణికై యెం దెందుఁ దిరుగుచుండెనో ఆమ్మహామహుఁ డెక్కడ సంచరించుచున్నను నతని కేమిభయము? ధాత్రీతలంబ శేషం బతనిచే నీవరకే నిశ్శేషశాత్రవంబుగా నొనరింపఁబడినది. ఇంక శాత్రవులవలని భయ మెక్కడిది? కృష్ణుని బలపరాక్రమంబు లెఱింగి యుండియు నేల భయ మొందుచున్నారు?

మ॥ శకటారిన్ దెగటార్చె, నోర్చె బకునిన్ ♦ చాణూరు మర్దించె ము
ష్టికు నష్టంబొనరించె వత్సకుని నోం ♦ చెన్ జించెఁ గాళింగుఁ గం
సకులధ్వంస మొనర్చె నట్టితనయున్ ♦ సామాన్యుగా నెంచి మీ
న్నక చింతించెదరేని వాని కెటనై ♦ నన్ గీడు చేకూఱునే?

వసు—వాని కేమికీడుగాని యెందున్నాఁడో వర్తమానమైన రాకున్నదే యని దిగులొందుచున్నాను.

అక్రూ—వర్తమాన మేటికి? నేఁడో రేపో యతఁడే కృతకృత్యుఁడై వచ్చును.

(భటుఁడు ప్రవేశించి) దేవా! ద్వారమునందొక యతీశ్వరుఁడు వేచియున్నాఁడు.

వసు — ఆచార్యరుడా! ఆమహామహుని మనమే ప్రత్యుద్ధానము చేసి పిలిచికొనివత్తము రమ్ము. (అని ద్వారముకడకువత్తురు పిమ్మటనొక కపటయతిప్రవేశించును)

యతి — ఆహా! మిత్రకార్యము దీర్చుటకు నేనెంతవఱకెన్ని పోచికోలువేసములు వేసితిని.

గీ॥ తెగువగడ్డాలు మీసాలు ♦ దీసివేసి
ఆడువేసాలతో నాట ♦ లాడినాఁడ
మూత్రికడ్డముగా గుడ్డ ♦ మూతజేసి
మొండినైయుండు కపటత్రి ♦ దండినైతి ॥

ఎన్నిపాట్లుపడినను గార్యము సానుకూలమైనచో నంతచింతయుండదు. కార్యము ననుకూలపడక యేమి? మఱిం గణింపకపోయినను సాత్రాజితినిహరించి శతధన్వునిచేత నుండిలిగదా కృష్ణునకెట్లును మణిలభింపదు. లభించినను వానికాకన్యం దక్క నీయను కృష్ణుఁడింకను మరలిరాలేదని తెలిసినది. వాఁడువచ్చునంతలో వసుదేవాదులకొక దుర్వార్తం దెలిపి బలరామాదులతో వసుదేవుఁడు చిచ్చురకున్నట్లు చేసెదను. పిమ్మట నస హాయుఁడైనకృష్ణుని ననాయాసముగాఁ దెగటార్చెద. అప్పుడుగదా కంసుని ఋణము దీర్చినవాఁడ నౌదు.

వసు — యతిచూడామణీ! నమస్కారము. దేవర యీపీఠంబల కరింపుఁడు.

యతి — మీరును మీ మీ పీఠంబులఁ గూరుచుండుఁడు.

వసు — చిత్తము మునీంద్రా? తామెందుండి యిందులకేతెంచితిరి? మీవంటిమహానుభావు లరాక కేదేవిమహాత్మ్యగణ ముండకపోదు. ఏమైనను,

శా. ధన్యంబయ్యె గృహంబు, జన్మముకృతా ♦ ర్థంబయ్యె, మూర్ధంబు స
నాథ్యంబయ్యె భవత్పదాంబుజ రజో ♦ న్యాసంబునన్ దూరిమూ
ర్ధన్యా తాపదృశ యోగివర్యుల సప ♦ ర్యాసిద్ధి మూవటిసా
మాన్యగృహస్థులకున్ లభించెను గదా ♦ పుణ్యంబిఁకేమనన్.

యతి — (స్వగతము) ఆహా! పుణ్యము చెప్పవలసినదేమి స్వర్గసుఖమే చేకూరనున్నదిక దా (ప్రకాశముగా) రాజచంద్రా! నీయుపచారవాక్యముల కేనెంతయు సంతసించితిని. నీవంటి సంపన్నగృహస్థునకు నానోటిమీఁదుగానొక దుర్వార్త యెఱిం గింపవలసివచ్చినందులకు నేను లోలోఁగృశించుచున్నాను.

వసు — యోగివరా! దుర్వార్త యెవ్వరివిషయమున?

యతి — ఎవరివిషయమో యైనచో నింతచింతయెందులకు? మనకృష్ణునివిషయమే.

వసు — అయ్యో! మునీంద్రా! మాకృష్ణుని కేమికీడు మూడినది?

యతి — ఏకీశుఁడాడిన మన మేమిచేయఁగలము? చూడు,

మ. ధరఁబుట్టెం దిఁక ప్రాణికెక్కడి స్థిర ♦ త్వంబాయువుల్ దీరఁ జ
త్తురు వేఱొక్కెడఁ బుట్టుచుండుదు రలం ♦ తులున్మగ్నులై మోహాసం
సరణభ్రాంతి సతీసుతాలయ దురా ♦ శం జిక్కి దుఃఖింతురో
క్కరికై యొక్కరు ప్రాజ్ఞులెం చెదరు దుః ♦ ఖంబుల్ సుఖంబొక్కమై

వసు — యోగివరా ! ఎందులకీ వేదాంతములు ?

యతి.— పుత్రవియోగ దుఃఖోపశమనమునకు.

అక్రూ — మునీంద్రా! పుత్రవియోగదుఃఖ మెవ్వరికి?

యతి — ఈదేవకీ వసుదేవులకు.

వసు — హా కృష్ణా ! (మూర్ఛిల్లును)

(దేవకి ప్రవేశించి) అక్రూరుఁడా! ఏమి యప్రియము!

అక్రూ — అయ్యో ! ఇంకేమున్నది. ప్రపంచమే మునిఁగిపోయినది.

వసు — హా కృష్ణా హా ! బలానుజా ! హా ! యదుకులధురంధరా ! హా ! యశోదా కిశోరా! హా! పాండవపక్షపాతీ! హా! శకటాసురభంజనా! హా! వేణునాద విశారదా? హా భువనైకమోహన? (మూర్ఛిల్లును)

దేవకి — కొడుకా! నేను చావనేచచ్చితిని. (మూర్ఛిల్లును)

అక్రూ — అయ్యో! అంతబలపరాక్రమశాలియైన కృష్ణుఁ డెవ్వనిచే వధింపఁబడెనో?

వసు — మునీంద్రా! నాకుమారునకు మారకుండైన యాక్రూరుఁ డెవ్వఁడో సెలవిండు ?

యతి — వనిన ద్వేషింపఁబోయిన నీకుమారుని గంసమిత్రుండగు శంబరాసురుఁడు పట్టి వధించినాఁడు.

దేవకీ — హా! బిడ్డా! కన్నకాన్పులన్నియు నాకంసునిపాలఁబెట్టి నిన్నొకనినైన మిగిల్చుకొంటి ననుకొంటిఁ గదరా తండ్రీ! దైవము నిన్నుఁగూడ మాకెడఁజేసెనే?

వసు — అక్కటా! ఎంతవైపరీత్యము సంభవించెను.

మ॥ బకచాణూరక ముష్టికాదిరిపు సంబా ♦ ధోగ్ర బాహాబల
ప్రకటుండౌ సుతుఁ డొక్క శంబరునిచేఁ ♦ బ్రాణంబుఁ గోల్పోవ, సిం
హ కిశోరంబును గుక్క చంపుటయు త ♦ థ్యంబింత ప్రారబ్ధమా
అకటా ! దేవకికన్నకాన్పలిటుల ♦ న్యాయంబులై పోవునే !

అక్రూ — అకటకటా! ఈఘోరవార్త విని మందభాగ్యురాలగు రుక్మిణి యేమిఁ గాఁగలదు! అయ్యో! నేఁటితో యాదవవంశమంతయు నస్తమింపవలసిన దుర్యోగము సంభవించెనుగదా.

దేవకి — అయ్యో! అక్రూరుఁడా! ఇంకఁ గోడలు రుక్మిణి బ్రతుకుట యెక్కడిమాట?

రుక్మి — (ఆతురతతోఁ బ్రవేశించి) ఏమిసంభవించినది?

వసు — కుమారీ! ఇంకేమున్నది,

సీ॥ భాగ్యహీనయగు దే ♦ వకి యెమ్మెదవ కాన్పు
యాదవాన్వయ భూరు ♦ హాంకురంబు
పడతి యశోదకే ♦ ర్పడిన నోములపంట
వల్లవీ జనమనో ♦ వల్లభుండు
కంసాది ఘోరరా ♦ క్షస వీరసంహారి
నిరత బృందావనాం ♦ తరవిహారి
కాళీయఫణిఫణా ♦ గ్రముల నట్టువకాఁడు
గోరక్షణము సల్పు ♦ గొల్లవాఁడు
గీ॥ మకరకుండలమండన ♦ మండితుండు
వేణుగానసుధారస ♦ విశ్రుతుండు
నాకుమారుండు ఏమనో ♦ నాయకుండు
భూమిపై లేఁడు మాయమై ♦ పోయినాఁడు.

రుక్మి — హా జీవితేశ్వరా! హా భువనమోహన (మూర్ఛిల్లును)

దేవ — అయ్యో! కోడలా! మాకన్నులయెదుటనే నీకింతటి యవస్థ సంభవించెనే. అమ్మా! నిన్ను నేనేమని యూరడింతు?

వసు — హా కృష్ణా! ఏండ్లుగడచి చీకులమై త్వదేకశరణ్యులమై జీవించుచున్న నీజననీజనకులగు మాకును నిన్నుఁగాక యితరుని వరింపనని పట్టుపట్టి నీయొడఁజేరిన యీనీస్వయంవరవధువును రుక్మిణికిని నేడెవ్వఁ జూపిపోయితివి? తండ్రీ! నీవుఁబోవు మృత్యువుగా నా శంబరుండెక్కడ దాఁపరించె? నాయనా!

వ॥ అవినీతిఁ గరపాదబంధములఁ గా ♦ రాగారమందుంచి మ
మ్మవినిన్ బెట్టిన కంసునిన్ దునిమి మా ♦ ప్రాణంబులన్ నిల్పినాఁ

డవు; ఘోరంబుగ నీదురంతము నను గూ ♦ డఁ గంటిమద్దాన, నెం
త విరుద్ధ పుటవస్థకె మనిపెఁ బు ♦ త్రా దైవ మీచికుఁడా॥

రుక్మి—హా జీవితేశ్వరా! భువనైకవిక్రమ కళాధురంధరుండవగు నీవు నేటిలాగ నీచ
దానవునిచే నంతమొందుట నాదురదృష్టముగాక మరేమున్నది? హా! ప్రాణపతీ!
నన్నుఁ బరిణయంబగునాఁడు శిశుపాలాది శూరులఁ బెక్కండ్ర నుక్కడంచిన నీబా
హుశౌర్యము నేఁడేమైనది? జనకునకు ననిష్టమైనను సోదరునకసమ్మతమైనను నిన్ను
గాక నన్యునివరింపనని పట్టుబట్టి తుట్టతుదకు నిన్నే పెండ్లియాడిన యీరుక్మిణి కింత
లోఁ గట్టియిక్కట్టుసంభవించెనే? హా! హృదయేశ్వరా! నిన్ననుసరించి చిత్తము
భవదాయత్తంబొనరించికొనిన యిల్లాలిఁ దగనాడఁజనునే? కృష్ణా! వాసుదేవా!

ఉ॥ ఏగతి నన్ను బాసెదు హృ ♦ దీశ్వర! నీవెట కేగుచుండినన్
నీవెనువెంటనే నడుచు ♦ నీడను నన్నెడబాప నేరికా?
పావనశీలయౌ సతికి ♦ భర్తృవియోగము దేడ? చిత్తరా
జీవము నీయెడన్ నిలిచె ♦ ఛీ! తను వేటికి నే త్యజించెదన్.

దేవకి—బిడ్డా! రుక్మిణీ! నీవెత్తోవఁబట్టెదవో నేనును నాతోవనే యనుసరించెదను.
వసు—కుమారీ! ఊరడిల్లుము నీదుఃఖమునకిఁక మేర యెక్కడిది? నాయనా! కృష్ణా!
ఎంతకష్టము తెచ్చిపెట్టితివోయీ

చ॥ చుఱచుఱఁగాల్చు నీకడుపు ♦ శోకముచేత నె చచ్చుచుండఁగాఁ
బురపుర నీవిమోగమునఁ బొక్కుచుఁగన్గవ బాష్పపూరముల్
గురియుచు నేడ్చు నీయనుఁగు ♦ కోడలిదుఃఖముగూడ నయ్యయో
కఱకఱ లంపమై కడుపుఁ ♦ గండలఁగోయుచునుండెఁ బుత్రకా!

నాయనా! ఇంతదురంతమైన దుఃఖమున దినదినము కృశించి చచ్చుటకన్న నిప్పుడే
మేమందఱ మగ్నిముఖంబునఁ బ్రాణపరిత్యాగంబొనర్చికొనుటయే మేలుకాదే.

యతి—రాజా! గోత్రపవిత్రుండగునట్టి పుత్రుఁడు గతించిన వెనుక మీకింకను నీశరీ
రములతో పనియేమి? మేము నీసాహసకర్మంబులఁ జూడఁజాలము కావునఁ బోయె
దము (స్వగతము) నేఁటితో నీయాదవవంశమంతయు హతమొందఁగలదు నన్నెవ్వరు
గుర్తింపకమున్నె నేనిక్కడనుండి వెడలిపోవుట మంచిది. (నిష్క్రమించును)

సుతని వెగన్నవారికిఁక ♦ శోకము మాత్రమె మిగిల్చె నింతకున్
బ్రతికిన మా యభాగ్యపరి ♦ పాకము దూరెదఁగాకిఁ కేమనన్ ||

రుక్మి — మామా! ఇంకేల యాలస్యము. పూజ్యురాలగు నత్తగారితోఁగూడ నేనికఁజిచ్చుబతికి నాప్రియతమునిఁ గలిసికొందును. మీరును మీయిచ్చవచ్చినట్లాచరింపుఁడు.

వసు — హా! ఎంతఘోరము సంభవించెను. దేవీ! దేవకీ! నీవెంతటి యదృష్టహీనురాలవు.

క|| కడుపెడు సంతానము గన
నేర్పడియెన్ దుదినీకు గొడ్డు ♦ రాలితనంబే
పొడుగునఁ బాగిలెగయుచు నీ
కడుపు దహించుచునె యుండెఁ ♦ గా నిప్పటికిన్ ||

హా! తండ్రీ! హా యశోదాకిశోరా!

చ|| కడుపునఁ గాంచుటే తడవు ♦ గాఁగ గసికందును నిన్ యశోద చే
నిడితి నెఱుంగ నిన్నెనుచు ♦ టేపియుఁ గంసుని బారికిన్ భయం
పడి యెటనేనియున్ బ్రతికి ♦ బాగుగ నుండినఁజాలు మంచపుం
దొడుగులమైన మాకుఁ దిః ♦ తోయములిత్తువఁటంచు నమ్మఁగాఁ
గడకిటు నీకె మేము కొడు ♦ కా! విడుమంటిమి బాష్పపూరముల్

అయ్యో! ఈఘోరవార్త బృందావనమునందలి నందాదులును బలరాముఁడును విన్న నేమగుదురో. నాయనా! బలరామా! నాప్రార్థమున నీవు నీతమ్మునికి సహాయముగుట కాతని వెంటనుండుమని తటస్థించినదే.

(పెమ్మట బలరామ సాత్యకులు ప్రవేశింతురు.)

బల — పూజ్యులగు నందాదుల సందర్శింప బృందావనమునకేగి నేటికి నాల్గుదినములయినది. శ్యమంతకాన్వేషణంబునకై యేగినతమ్ముండింకను రాకుండునా? వానింజూడ నానేత్రములు త్వరపడుచున్నవి. తమ్ముఁడా! సాత్యకీ! ముందుఁ గృష్ణునిరాక నారయుదము రమ్ము. (అని హజారపు ద్వారము ప్రవేశించి) తమ్ముఁడా! ఏమిది నేఁడు నగరమంతయుఁ జిన్నవోయి చెన్నుతఱిగి యున్నది. పరిజనుఁడొక్కఁడును ద్వారముకడ లేకుండుటకుఁ గతమేమి? అదియుఁగాక,

సీ॥ వినఁబడదేమి యే ♦ వేళ సందడిమ్రోఁగు
వీణామృదంగ ని ♦ క్వాణపటిమ
కనఁబడదేమి కా ♦ న్కలఁబట్టి పడిగాపుఁ
గాంచు సామంత భూ ♦ కాంత వితతి
అగపడదేమి ని ♦ త్యము హజారము నిండు
స్వస్తివాచక విప్ర ♦ సముదయంబు
వఁ వినరేమి త ♦ మ్మునకు సోత్సాహులై
నాంకఁదెలుప దౌ ♦ వారికులును
గీ॥ అనుజ! నేఁడేమిమూడెనో ♦ మనసుఁగాంచి
పరిజనులు నించుచున్నారు ♦ బాష్పవారి
ఎచటఁగనుగొన్న శోకమా ♦ కృతివహించె
నల్లదే నగరుఁడౌ హా ♦ హారవంబు॥

సాత్య—అగ్రజా! ఏమో తెలియకున్నది? పూజ్యులైన దేవకీవసుదేవుల క్షేమమునకే మియుఁ గొఱంతలేదుకదా.

అక్రూ—బలరామసాత్యకులు వచ్చుచున్నారు. పరిదుర్వార్త యిదివరకే విన్నారు కాఁబోలు.

వసు—అయ్యో! అక్రూరుఁడా! వారిమొగము నేనెట్లు చూతును. హా! కృష్ణా!

బల—(ఆకర్ణించి) తమ్ముఁడా! సాత్యకీ! తండ్రిగారిమాటయే వినవచ్చుచున్నది. త్వరగఁ బోవుదముపద. (అని దేవకీవసుదేవులకడకుఁ బోవుచున్నారు.)

వసు-దేవకి-నాయనా! బలరామా! నీతమ్ముఁడు మాయమైపోయెనుగద. (అనిమూర్ఛిల్లును)

బల—అక్కటా! ఏమియీదైన్యము. అక్రూరుఁడా! ఏమిసంభవించినది!

అక్రూ—నాయనలారా! మనకృష్ణుఁడు........అయ్యో! ఏమనిచెప్పుదును?

బల—ఏమీ! ఏమీ!

వసు—నాయనా! ఇంకేమున్నది?

మ॥ యదువంశాంకురమై యెవ్వఁడు త్రిలో ♦ కానంద సంధాత దు
ర్మద కంసాద్యఖిలాసురాళి నలిపె ♦ మత్తేభ మెవ్వాఁడు నా
హృదయాభీష్టమెనంబు నందఁగల వివ ♦ రిష్ణుఁడు నాకృష్ణుఁడీ
ముదుసళ్ళన్ దిగనాడి యక్కటకటా! ♦ పోయెంగదా మాయమై

శా॥ చింతుఁ గంతుహరుఁ, గృతాంతకుని శి ♦ క్షింతుఁ, బలారాతిసా
ధింతుఁ, లోకపతిఁ గలంతు, నపర ♦ ద్వట్కుండముం బట్టి బా
ధింతుఁ, సాగరసప్తకంబు పరిశో ♦ షింతుఁ భవచ్చిత్త మొ
ప్పింతుఁ, జూడు మిదే జగత్త్రితయముం ♦ వేధించి తెత్తుం హరిన్

అక్రూరుఁడా! మందా దొంగముని యెటుపోయెనో చెప్పుము?

అక్రూ—అయ్యా! ఇప్పుడే వాఁడీవంక నేగెను.

బల—తమ్ముఁడా! సాత్యకీ! రమ్ము ఆదుర్మార్గునిఁ బట్టికొని చేయవలసినపని చేయుదము

సాత్య—ఇదిగో ధనుర్బాణములతో నేను సిద్ధముగానే యున్నాను నడువుఁడు.

(అని యిరువురు పరువునఁ బోవుదురు)

వసు—అక్రూరుఁడా! బలరాముఁడు మిగుల తొందరవాఁడు. కోపతీవ్రమున నెవ్వరి నేమి చేయునోగదా?

అక్రూ—అయ్యా! ఎంతతొందరవాఁడైనను యుక్తాయుక్తములు విచారింపకపోఁడు. ఆతఁడనిన నెవ్వఁడో రక్కసుఁడొనరించిన మోసకృత్యముగానే నాబుద్ధికిఁ దోఁప గట్టుచున్నది.

(పిమ్మట శంబరాసురుఁడు పరువెత్తుచుఁ బ్రవేశించుచున్నాఁడు.)

ఏటికో బలరామసాత్యకు లుద్రేకమున నాకొఱకుగాఁ బరువెత్తుకొని వచ్చుచున్నారు. నేఁజేసిన మోసకృత్యము వారికిఁ దెలిసినదికాఁబోలు నేనిఁక వారికంటఁబడితినా నాపని సున్నయే. ఇందెందైన దాగియుందు (అని యొకమూల దాఁగుచుండ బలరామసాత్యకులు పరుగుఁ బ్రవేశింతురు)

శంబ—ఎవరయ్యా! మీరు? ఎక్కడ నెవ్వరితో సంబంధము లేని యలౌకికపరివ్రాజకుల నిర్బంధించుచున్నారు.

సాత్య—ఆహా! ఏమి తపస్తేజము గాంభీర్యము మూర్తీభవించినట్లే.

బల—(అపహాస్యముతో)

క॥ తారుపరివ్రాజకుల
యయ్యా? రాచదివాణమునకు ♦ నరుదెంచినవా

శంబ—(స్వగతము) క్రిమ్మరేకా? (తెలిసిప్పుడేమనను) వారెవరో

పోరయ్యా మమ్ము నడ్డఁగోలదు మీకున్

బల — ఆహా! మహానుభావులుమీరు

శా॥ వ్యాసాదుల్క్రముఁబోలరీ రెవ రగ ♦ స్వ్యభావితలా యేమి తా
మీ నన్యాసము నూనినందులకు నేఁ ♦ డే మీకునీవైమహాశం
బౌసంబంధములన్నియుందోలఁగు మో ♦ తూవా ప్రియా, బాడుగో
ల్వసాల్వయు నవస్థయుంగడచును ♦ ర్వ్యాభారముల్ దూరమా॥

సాత్య — అగ్రజా! అక్రూరునిగూడ నువవెంటఁదీసికొనివచ్చిన బాగుండునుగదా. ఆతఁడు చూచినవాఁడు గాన దొంగనునినిగుర్తింపఁగలుగు.

(అంతట నక్రూర వసంతకులు ప్రవేశించుచున్నారు)

వసం — అక్రూరుఁడా! నీవు ముందుఁబరుగిడి బలరామ సాత్యకులఁ గలసికొనుము. నేనెండ్లుగడచిన ముసలివాఁడనగుటచే నీతోఁ బరువెత్తలేను. వయసునఁ గొంచెము మెచ్చుతగ్గునకేమి సమానుఁడనైనను రాజుగారి సువారములోనుండు రాజబంధుఁడవౌటచే శరీరదార్ఢ్యము నీకంతగాఁ దగ్గలేదు.

అక్రూ — వసంతకా! ఇప్పుడును హాస్యము లేనా?

వసం — నాబ్రతుకే హాస్యముకదా.

అక్రూ — (త్వరగఁబరువిడుచు) బలరామా! వాఁడే వాఁడే పోనీకుము.

(అనుచుఁ గలసికొనును)

బల — అక్రూరుఁడా! వీఁడేకదా యాదురాత్ముఁడు (అని వానిఁగొట్టుచు) రేవంచకా!

క॥ ఇపుడేనునివాగితిరా
కపటపుసన్యాసినీవు ♦ గావా చెప్పుమా
నృపునకు వెగటుగనేదో
విపరీతము విరిచినట్టి ♦ పీఁఅడిపు ఖలా!

చెప్పుము నిన్నింక విడువను.

చ॥ వెడవెడనీచవుంబగటి ♦ వేసపుఁ బాండితి యెల్లఁజూపి నీ
కొడుకగతించెనంచటవ ♦ గూతలుగూసి నృపాలుచిత్తమా
టడియొనరించి తెవ్వఁడవు ♦ రా? అవురా! యిటువంటిమోసమా
నడునడుమింక రాజభవ ♦ నంబునకుఁ మెడగోసిపై చెదర్

(అని లాగుచుండ వాఁడు పెనగులాడును)

క॥ ఈనీలు గేలయింకం
బోనేర్తు వెమమ్ముం గడచి ? ♦ బుద్ధిగలిగిమా
తేనికడ నిజము చెప్పెదు
వానినువిడు నడువు నడువ ♦ వా మెడంగోంతుం

వసం—(కఱ్ఱతట్టుచు) అయ్యా! వానికిం దగినశాస్తిగావింప బ్రాహ్మణశూరుండనైన నేను వచ్చుచున్నాను. నీవు వానినిగట్టిగాం బట్టికొమ్ము (అనుచుం బ్రవేశించి వానినిం దనదండముతోం గొట్టుచు)

క॥ భడవా! యెంతకుం దెగితివి
నడిపగంటనె కన్న పెట్టు ♦ నాలివిని నా
పడవేసి కడుపు నలగు
మ్మడికాయుంబోలెం గోసి ♦ మడ పెదరమా త్ర

(బలరామునితోం) అయ్యా! ఈఋషీశ్వరులెవరో మీరెఱుంగుదురాం బోలు

బల—వసంతకా! ఎవరేమి?

వసం—వీరు శంబరఋషీశ్వరులు

సాత్య—అనంగా మాయాఋషులనియా?

వసం—అయ్యో! మీకింకను దెలియదయ్యెనా? మీరందఱు నన్ను మందబుద్ధియని నవ్వుచుందురుకా, నేనే యిప్పుడు కుశాగ్రబుద్ధినైతిని వీరు శంబరాసురఋషీశ్వరులు ఇప్పటికైనం దెలిసినదా?

బల—ఎట్లూ! నేననుకొన్నట్లేయైనది. కంసమిత్రుండు శంబరుండావీండు కంసునిపరివారములలో జావక మిగిలినవాండావీండు. వీనినింకనూరక పోనీయరాదురే! శంబరా! కదలుము నేంటితో నీయంకము ముగించు (అనిలాగికొనిపోవుచున్నాడు)

వసం—ఓరీ శంబరుండా! నీవాత్రికనేం డేమిబాగున్నదికాదురా కన్నములోం జిక్కిన పగంటిదొంగవైతివి. ఓరి బానిసకొడుకా! యెన్నివేషములు వేసితివిరా

గీ॥ కులికితివి సత్యభామవై ♦ తొలుతంబిదప
మోసపుంగతి మొండిన ♦ న్యాసివైతి
పాడుశతధన్వుడయి ♦ పాకులాడి
నోంతంబడితి నేండు నీ ♦ కొంపమునింగె॥

ఆ! ఏమిరా మిట్టిమిట్టిమూచెదవు (బలరామునితో) ఆర్యా! వీనిని సడలువిడిచెదవు సుమీ బ్రాహ్మణహత్యచుట్టుకొనును నాకొల్లాయిగుడ్డనిచ్చెదను వీని ఱెక్కలువిఱిచి కట్టుము.

బల—ఇంక వీఁడెక్కడకుఁ బోవఁగలఁడు (అని నగరులోనికిఁ జేరుదురు)

వసు—నాయనా? వీఁడు నిజముగా దొంగయేకదా?

వసం—దొంగకాక దొరయాయేమి వీఁడు కంసునిపరివారములోనిశంబరుఁడు.

వసు—ఓరి దురాత్ముఁడా! శంబరుఁడా! యెంతపనిచేసితివిరా?

వసం—ఏగోచిపాతరాయుఁడు వచ్చినను నెత్తిమీఁది దేవతయని మీరునమ్ముచుందురు అట్టివారే కొంపలార్పువారు అగస్త్యుఁడొకయెత్తు ఆయనకమండలువు నొకయెత్తు అనునట్లు వీఁడొకయెత్తు వీనిగడ్డమొకయెత్తు చూచుచుఁ బావురుపిల్లివలె నెట్లుజూచుచున్నాఁడో. మనకృష్ణునకుఁ బ్రీతికక్షియై వీఁడెంతలేసి సాహసములుచేయుచుండెనో మీరెఱుఁగరు ఇప్పుడేమి మకనకృష్ణుఁడురానీ వీనిభరతముపట్టింతును.

కంచుకి—(ప్రవేశించి) ఆర్యా! మనచిరంజీవి కృష్ణుఁడిదేవచ్చుచున్నాఁడు

వసుదేవాదులు—ఎక్కడెక్కడ

(అంతట రథారూఢుఁడై సాత్రాజితితోడను నొకనూలఁ బెడఱెక్కలు విఱిచికట్టఁబడిన శతధన్వితోడను కృష్ణుఁడు ప్రవేశించుచు)

ఉ॥ ప్రాకటధర్మసంచరణ ♦ పౌరవరుల్గనుఁగొండు రండు వీఁ
డేకులపాంసనుండుమును ♦ రీహుఁడునై శతధన్వపీనిపై.
నీ కులకన్యకంబలిమి ♦ చేఁ జెఱఁబట్టుటకూడదంచు నం
బూకృశమాచరింపుఁడన ♦ పుంగన మీరునుమీరుమీరునుఁ॥

వసు—(ఇంతలోవసుదేవాదు లెదురువచ్చి) కృష్ణా ఎన్నాళ్లకు మాకంటబడితివితండ్రి

కృష్ణ—జననీజనకులారా! అభివాదనము అగ్రజా! నమస్కారము.

దేవకీ—వసు-బల-చిరాయుష్మంతుఁడవై యుండుము

దేవ—అబ్బాయి, ఈయమ్మాయి మనసత్రాజిత్తుబిడ్డగదా అమ్మా ఇటురా రథము నెమ్మదిగా దిగుము.

కృష్ణ—అమ్మా! పాపమీకన్యంబలిమిమై బట్టిరథంబునఁబెట్టికొని దురాత్ముఁడగు నీశతధన్వుఁడుపోవుచుండఁగా నే నెదురువడి వీనినీరథంబునఁగట్టి యిక్కడకుఁ దెచ్చితిని.

రుక్మి—నాథా! అభివందనము.

కృష్ణు—దేవీ ! కుశలమా

రుక్మి—నాథు నెయనుగ్రహమున్నం గుశలమునకేమి ?

దేవ—ఎంతటిదుర్మార్గుండవు నీవు

రుక్మి—(స్వ) ఈబిడ్డ కేకదా నాథుండు మణిని ద్వేషింపం బోయినది. చెల్లెలా! అదృష్టవశమున మృత్యుముఖమునుండి మాడిపడితివి. సౌభాగ్యవతివికమ్ము.

వసు—దేవిగారనుగ్రహించినలోపమేమి?

రుక్మి—(స్వగతము) ఈబ్రహ్మచారి తనవక్రతమూహించుచున్నాడు.

కృష్ణు—తండ్రీ! సత్రాజిత్తునకీవార్త దెలియంబంపుడు అతఁడు నాపై వేసిననిందకై యాతని శ్యమంతకపుజాడ నెఱింగి తెచ్చితి ఇందతిలో నాతనికి మణియిచ్చెదఁగాక (ఇంతలో సత్రాజిత్తు ఆతురతతోఁ బ్రవేశించి) అయ్యా ! వసుదేవా! మీకృష్ణుఁ డెక్కడ?

వసు—కన్నులువిప్పిచూడుము అతఁడేకృష్ణుఁడు. ఈనడుమ కృష్ణుడేవ గాంధ్రుడు బయలుదేఱటచే మోసపోయి నిజమైనకృష్ణుడెవరైనది తెలిసికోలేకున్నాఁడవు కాఁబోలు.

సత్రా—కృష్ణా! నామాతుమాయూరియైన శతధన్వుఁడెత్తికొనిపోయినాఁడట వాఁడు నీకంటఁబడ లేదా ?

వసు—వాఁడు మాయావియగుట యిప్పుడు తెలిసినదికాఁబోలు తొలుతనమ్మ నిగ్రహించుచున్నాడు వాఁడే పరమబంధుఁడు. ఏదైనను నెత్తికిఁ జేతులువచ్చినప్పుడుగాని తెలియదు.

కృష్ణు—అయ్యా! వాఁడు నాకంటఁబడెను. అతఁడేశతధన్వుఁడు పట్టితెచ్చితిని. అదిగో నీతనయ. ఇదిగో నీశ్యమంతకమాణిక్యము.

సత్రా—(శతధన్వతో)ఓరీ బంధుద్రోహీ! ఎంతసాహసము చేసితివిరా అమ్మా సత్యా! ఈదుర్మార్గునివలన నెంతపంభవము నొందితివే తల్లీ.

కృష్ణు—సత్రాజిత్తూ! నాఁడునిర్హేతుకముగనన్ను నిందించితివి గాని నిజమూరయవైతివి. ఇఁక జరిగిన వృత్తాంతమాకర్ణింపుము.

క॥ అడవికిఁజనిన ప్రసేనున్
గడపిమణికోసమె హరియొకండద్దా న్
గెడపికొనె జాంబవంతుఁడు
కడకతనిసినెటోడయించి కంటిన్నీకై॥

సత్రా—కృష్ణా! నేనపరాధిని. ఎఱుకలేనికతమున నిన్నెంతయో తూలనాడితి నానేరము క్షమింపఁబడుఁగాక.

శా॥ క్రూరశ్రేణికిఁ జిక్కి దిక్కుసెడియున్ • క్రోశించునాకూర్మిక
న్యారత్నంబును బంధులం, గలిపిప్రా • ణాపాయముం బాపి, మ్రుక్
జోరగ్రస్తము నాశ్యమంతకమణిన్ • శోధించి సాధించితీ
కారుణ్యంబున కేమి ప్రత్యుపకృతిన్ • గావింపఁగాఁ జాలుదున్॥

కృష్ణా! నాఁడు నిన్నంతగా నిందించినను నాకింతటి యుపకారమొనర్చిన నిన్ను నేనెంతని కొనియాడుదు. ఆహా యిదికదా మహోపకారిలక్షణము.

చ॥ ఇలనపకారికేనియిర • పేక్షితులై యుపకారమేఁగగన్
సలుపుదురుత్తముల్ • సుగుణశాంతసమగ్రులనుగ్రహంబునన్
అలసుమనోగణంబిడు మ • దాళికిఁ దాడనకోర్చి తేనెపూ
త్రుఁఫలమిచ్చెదుర్ ఘనత • రుల్ తమకొమ్మలఁగొట్టువానికేన్॥

కృష్ణా! ఇంక గతంబెల్ల మఱచి నా వేఁడికోలంగీకరింపుము.

చ॥ ఎఱుఁగక దుష్టబోధనల • కే చెవియొగ్గి మహాపరాధముల్
జఱపిన నాయవజ్ఞతకు సై • చి, దయామతి బంధుభావముల్
నెఱపుము నీగణించి మ • ణిందన యామణియుంగ్రహింపుమం
దఱఁదయయుంపు నాకులము • ధన్యతమంబొనరింపు మాధవా!

కృష్ణు—అయ్యా! ఇందునాచేసిన మహోపకారమేమున్నది. నేనీమణిని సాధించి తెచ్చినది నానిందఁ బాపికొనుటకుఁగాని నీయుపకారార్థమైకాదు కావున నీమణిని నీవ యుంచికొనుము. (మణినిచ్చుచున్నాఁడు)

సత్రా—అలాగైన నా కుమారీమణిం బరిగ్రహింపకతప్పదు. వసుదేవా! మనము సంబంధముకలిపికొనుట లెస్సగదా.

వసు—నాయనా! కృష్ణా! ఈతఁడు మనసంబంధమునకెంతయు ననుకూలుఁడు. నీవింక నీసత్రాజిత్తుప్రార్థన మంగీకరించి యాతనికన్యం బరిగ్రహించి యనుగ్రహింపుము.

వసం—ఈవిషయమె దేవిగారనుగ్రహింపవలయు.

రుక్మి—[స్వగతము] ఏమి యీ బ్రహ్మచారి యెంతసిగ్గుమాలినవాఁడు. [సత్రాజితి చేయి పట్టుకొని] చెల్లెలా! నావలెనే నీవును నీరసాలవృక్షమల్లికొనుము సర్వజగద్భరణుఁడైన యీమహానుభావుఁడు మనకిద్దరకు నాశ్రయుఁడు కాఁజాలఁడా!

(అని కృష్ణునిచేయిలోఁగలుపును)

గీ॥ మసృణమకరందరసమిది మావిమోక
నేఁతల్లిన మైఁ ఛాయానుకృతిని
అల్లికొను మీవు నిటజాతివల్లి వగుచు
భువనములఁ సద్యశస్సుమ బుచెలఁగ॥

వసం — దేవీ! ఈమావిమోకను నీజాతిలతకును నిఁక నీవే చక్కని దోహదమిచ్చి కాపాడవలయును.

రుక్మి — తోఁటమాలివి నీవున్నావుకదా.

వసం — సద్బ్రాహ్మణుఁడనైన నాకు తోఁటమాలి పనియేఁటికి. నేనిప్పుడు స్వస్తివాచకుండనయ్యెదను. "దేవీం వాచమజనయంతిదేవాః" అని చెప్పుచు సంధ్యావందనము నెఱుఁగకున్నను నీలాటి స్వస్తివచనంబులతో నేను వసిష్ఠుఁడనైతిని.

వసు — నాయనా కృష్ణా! ఇంక నీదుష్టుల యథార్హముగా శిక్షించి భూభారము కొంత తగ్గింపుము.

శత — (చేతులు జోడించి) కృష్ణా నేనపరాధిని దుర్మోహమున నింతచేసితి నన్నింక నీవేమి యొనర్చినను సంతసమున భరింతుఁగాక (నమస్కరించును)

శంబ — ఆర్యా! ఈతనివలనే నేనుఁ జెడితి నాయపరాధము క్షమింతురుగాక నేనిదే నీశరణము వేఁడుచున్నాను. శ్రీరాముఁడు విభీషణునిఁ బలె నన్ను నీవు రక్షింపవలయును (నమస్కరించును)

కృ — తండ్రీ! శరణాగతులైన వీరిం దండించుటపాడిగాదు ఓరీ శంబరా! ఓరీ శతధన్వా! ఇంతటనైన నాబుద్ధిని మంచిమార్గమున వర్తింపుఁడు.

శా॥ దేవబ్రాహ్మణగోతపస్వులను ♦ నార్తింగూర్పఁ డండ్ర కాం
తావారంబులఁ దల్లులంగ నెను ♦ కంటం జూడుఁడ స్తోక వి
ద్యావైశద్యమునన్ గ్రొలంగుఁడ ♦ సురవ్యాసంగములొల్లఁడి
ట్లైవర్తింపరదేని వేర్లెత్తెదమ ♦ దీయక్రూరచక్రాగ్నులన్

శంబర శతధన్వులు — దేవా అట్లే వర్తించెదము.

కృ — అక్రూరుఁడా! ఈశతధన్వునిం బంధముక్తిగావించి పంపివేయుము.

(అక్రూరుఁడట్లు చేయుచున్నాఁడు)

శంబర శతధన్వులు — నమస్కరించి (నిష్క్రమింతురు)

# సుప్రసిద్ధనాటకములు

1. సత్యహరిశ్చంద్రీయము — బలిజేపల్లి లక్ష్మీకాంతకవి విరచితము. సర్వజనములచే కొనియాడఁబడుచు పెక్కు నాటకసమాజముల వారిచే ప్రదర్శన మొనరింపఁబడిన నాటకరాజము. ప్రతిపద్యము మనోహరమై, ద్రాక్షాపాకమున కొప్పుచు ఏకరసము వచ్చినప్పుడు అరసముచు వెదజల్లుచుండును. ఇప్పటి హరిశ్చంద్ర లన్నిటిలో నిదియే పేరు గాంచినది. ఔచిత్యమునకు పెట్టినపేరు. వెల రు. 1—0—0 గ్లేజు కాగితములప్రతి రు. 1—4—0

2. చిత్రహాసనాటకము — వాటు సుబ్బావధానికవి విరచితము. కథావస్తు నిర్మాణమునందు ఇట్టినాటకము తెలుగులో కనుపించదు. సమానరూపనామములుగల ఇద్దరుపురుషులు, నాతినేరములు, వీరినిగురించి ఇతరులుపడినపొరపాటులు మనోహరముగా పద్యగద్యప్రాంతముగా వర్ణింపఁబడినవి. నాటకముచదివినఁగాని ప్రాశస్త్యము తెలియదు. మంచికాగితములు వెల 0—12—0

3. తెలుగు ప్రాక్టికల్ గ్రామరు — డైరెక్టరుగారిచే అనుమోదింపఁబడినది. కొన్ని పాఠశాలలో నుపయోగింపఁబడుచున్నది. వెల 0—5—0

4. భజగోవిందశ్లోకములు — మూలమునకుసరియైనపద్యములు. (అచ్చులో నున్నవి.) వెల 0—2—0

వలయువారు,

భాగవతుల సుబ్బయ్య, కొత్తపేట, తెనాలి.

అని వ్రాయవలయును.